





# ధర్మము

## విచారణ

## పునర్నిర్మాణానికి శంకారావం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120029573

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పునర్నిర్మాణానికి శంఖారావం

రచన:

డా॥ మోపిదేవి కృష్ణస్వామి,
ఎం. ఏ., పి. హెచ్. డి.,

ప్రచురణ:

ది యూనివర్సల్
హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్ట్

## ఇందులో.........

# ఒక్క క్షణం

ఒక్క క్షణం ఆగండి. రెండు మాటలు వినండి.

'మనుష్యుడు మృగము వలె ప్రవర్తించినట్లయితే, మృగము కంటే హీనుడవుతాడు.' అని రవీంద్రనాథ్ ఠాగోర్ అన్నారు.

దేశంలో అనుదినం జరుగుతున్న దురాగతాలు, అత్యాచారాలు అన్యాయాలు విశ్వకవి వాక్కును ధృవపరుస్తున్నాయి.

ఎవరు ఎవరినీ నమ్మలేని పరిస్థితి ఏర్పడింది. 'దేశంలో దొంగలు పడ్డార'నేది అక్షరాల నిజమవుతున్నది.

అసంభవాన్ని సంభవముగాను, అక్రమాన్ని సక్రమంగాను, అయోగ్యతను యోగ్యతగాను మార్చగల శక్తి ఒక్క 'డబ్బుకు' ఏర్పడింది. చచ్చిన వాణ్ణి బ్రతికించడం మినహా అది చేయలేని పనిలేదు.

సౌశీల్యం, సౌజన్యం, సౌమనస్యం అనేవి అవ లక్షణాలుగా తయారయినాయి. ఎవడి పని వాడు చేయటానికి మరొకడు ముడుపులు చెల్లించవలసి వస్తున్నది.

ప్రతి ఒక్కడూ ఒక అడుగులేని సంచిగా తయారైనాడు. దాన్ని నింపడానికి అహోరాత్రులు తాపత్రయ పడుతున్నాడు.

అయితే ఇంతటి నిరాశా పూరిత వాతావరణంలో గూడా ఒక ఆశాకిరణం ఉన్నది. అదేమిటంటే "ప్రపంచమెంత దుర్మార్గంతో

ప్రవర్తిస్తున్నా తెలిసో తెలీకో సన్మార్గానికి దాసోహమంటుంది." అన్నారు గాంధీజీ.

ఆయన పలికినది కాచి వడపోసిన సత్యం. దేశంలో చెడు ఎంత గొప్పగా విజృంభిస్తున్నా, మంచి యొక్క ఆవశ్యకము మనుషుల మనస్సుల్లో మెదలుతూనే ఉంది.

మంచిని పెంచడానికి అనేక సంస్థలు దేశంలో కృషిచేస్తూనే ఉన్నాయి. "మానవ ధర్మ శిక్షణ సంస్థ'' ఆ కోవకు చెందిందే. దీని నిర్వాహకులు డా॥ మోపిదేవి కృష్ణస్వామిగారు కార్యకర్తలను, వివిధ ప్రాంతాల ప్రజలనుద్దేశించి చేసిన కొన్ని ప్రసంగాలు ఈ పుస్తకరూపం దాల్చాయి.

సమస్య యొక్క స్వభావాన్ని విశ్లేషించడంలోను, పరిష్కార మార్గాన్ని సూచించడంలోనూ, విషయాన్ని హృదయానికి హత్తు కొనేటట్లు చెప్పడంలోను శ్రీ కృష్ణస్వామి గారు కడు సమర్థులు.

'ఈనాడు గుడులలో జరుగుతున్నది. అర్చనా ? లేక ఆర్జనా ?' అని సూటిగా ప్రశ్నించారు. దేవాలయాల ప్రయోజనం మరుగున పడి పోయి నందుకు ఆవేదన పడ్డారు. "గుడిగోపురాలలో మనం చేస్తున్న విగ్రహారాధన సజీవ విగ్రహారాధనకు మనం వేసుకొంటున్న రిహార్సల్ వంటిది. సజీవ విగ్రహారాధన జరుగుతున్న కొద్దీ యీ విగ్రహారాధన సంప్రదాయం గౌరవించబడుతుంది. లేనప్పుడు ఎగతాళి చేయబడు తుంది." అన్నారు.

"మనకు పనిలోనే విశ్రాంతి- పనిని విడిచిన విశ్రాంతి, విశ్రాంతి గాదు. సోమరితనం అవుతుంది" అని హెచ్చరిక చేసారు.

"మనిషికి వస్తుసముదాయం కన్నా తనతోటి మనిషి ముఖ్యమని తెలిస్తే, అతనిలో అశాంతి పోయి ప్రశాంతి నిలుస్తుంది. అసంతృప్తి బదులు తృప్తి కలుగుతుంది" అని నేటి సామాజిక రుగ్మతకు ఔషధం సూచించారు.

"సోదరులారా ! నచ్చిన పనులను గాక, చేయవల్సిన పనులకు అంకితం కండి" అని పిలుపునిచ్చారు.

ఇక మీరు ఈ పుస్తకం స్వయంగా చదివి మరిన్ని రత్నాలను ఏరుకోవచ్చు.

గుంటూరు—5

16-5-1986

—మన్నవ గిరిధర రావు
Ex. M. L. c.
సంపాదకుడు
"భారతీయ మార్గము" మాస పత్రిక.

  

# మనవరకు నడచివచ్చినకథ

నిజానికి ఈ జాతి పునర్నిర్మాణ కార్యక్రమం ప్రారంభమై చాల కాలమయింది. స్వాతంత్ర్య ఉద్యమంకన్న మరికొంత ముందుగానే ఈకార్యక్రమం ప్రారంభమైనదని చెప్పవచ్చు. వందలసంవత్సరాల బానిసత్వంలో వివిధజాతుల పదఘట్టనల క్రింద నలిగిపోయిన మన జాతి తన రూపురేఖలను దాదాపు కోల్పోయింది. తానెక్కడో! తన సంస్కృతి ఎక్కడో! తానెక్కడో! తన యథార్థ స్వరూపమెక్కడో! ఇలా శిథిలమై తనకు తెలిసినదే సంప్రదాయమనుకుంటూ తనకు తోచినదే ఆచారమనుకుంటూ బిక్కుబిక్కుమంటున్న జాతిలో పునర్నిర్మాణ ప్రయత్నమన్నది చాలపెద్దఎత్తుననే ప్రారంభమయింది. ప్రారంభమెప్పుడో అయినా రామకృష్ణ పరమహంస నాటినుండి దాని రూపం స్పష్టమైందని చెప్పవచ్చు. రామకృష్ణుడు, వివేకానందుడు, అరవిందుడు, రవీంద్రుడు, మహాత్ముడు ఇలా వీరందరి మీదుగా ఈ పునర్నిర్మాణ కార్యక్రమం కొనసాగుతూ వచ్చింది.

స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం వినోబాభావే, జయప్రకాశ్ నారాయణ్ వంటి మహనీయులు పునర్నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించాలని చూచినా ఆ ప్రయత్నం కావలసినంత వేగాన్ని పుంజుకొనలేదనే చెప్పాలి. ఈ పరిస్థితులలో తననాటి వరకు భారతజాతిలో పునర్నిర్మాణానికై జరిగిన కృషినంతటిని చక్కగా సమీక్షించుకుని దేశకాలప్రాంతాలను సూటిగా బోధపరచుకొని సమగ్రమైన జాతి పునర్నిర్మాణ ప్రణాళికను రూపొందించిన వారు 'కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య.'

కృష్ణమాచార్య తమ జీవితకాలాన్ని ప్రధానంగా ఖర్చుపెట్టింది రెండు కార్యక్రమాలపైన. మొదటిది భారతజాతి పునర్నిర్మాణం. రెండవది ప్రాక్పశ్చిమ సమన్వయం ఇందులో ప్రాక్ పశ్చిమ సమన్వయమన్నది వారాశించిన మేరకు సాధించబడిందనే చెప్పవచ్చు. తమనాటి వరకు పశ్చిమదేశాలలో జరుగుతూ వచ్చిన కృషిని వారెంతగానో విస్తరింపజేశారు. సనాతన ధర్మస్వరూపాన్ని ఆయాజాతులకు సమగ్రంగా బోధపరచటమేగాక ఆ మార్గాన శిక్షణ పొందేటందుకు కావలసిన పాఠ్యగ్రంధాలను కూడ వారికి అందించారు. సనాతన ధర్మాన్ని చిత్తశుద్ధితో అనుసరించడమే ప్రపంచశాంతిని సాధించటానికి ఏకైక మార్గమని ఆయాజాతుల వారు గ్రహించేటట్లు చేశారు ప్రాక్ పశ్చిమ సమన్వయానికై అంతవరకు కృషిచేసి తేజోమయ దేహాలతో నున్న పెద్దలందరూ జరుగవలసినది ఇన్నాళ్టికి జరిగిందని ముచ్చటపడేటంతగా వారు తమ పాత్రను నిర్వహించారు. నిర్వహించారు అంటే వారంగీకరించరు. వారి మాటలలో చెప్పాలంటే "కాలం కలసి వచ్చింది. ఆ జాతులు సిద్ధంగా ఉన్నాయి. కనుక అక్కడ పని అంతగా జరిగింది."

ఇక మన దేశం దగ్గరకు వచ్చేటప్పటికి జాతి పునర్నిర్మాణానికై ఆయన నుండి తీవ్రమైన కృషే జరిగిందని చెప్పాలి. వ్యక్తిగత సాధనలతో, ప్రయత్నాలతో తృప్తిపడిపోయే భారతీయుణ్ణి సామూహిక కృషిలోనికి మేల్కొల్పారాయన. ఆధునికత పేరిట నానాటికి ఒంటరివాడైపోతున్న భారతీయుణ్ణి తోటి భారతీయుణ్ణి పట్టించుకొనేటట్లుగా చేసారు. ఒకరికొకరై ఒకరు పదిమందై సమాజ శ్రేయస్సుకై కార్యక్రమాలను నిర్వహించండం దేశప్రజలకు అలవాటు చేశారు. వారు రూపొందించిన వైద్యసేవా కార్యక్రమం భారతీయులు బృందాలు బృందాలుగా రూపొంది సామూహిక కృషికై హృదయ పూర్వకంగా నడుం కట్టటానికి పనికి వచ్చింది. ఈ కార్యక్రమం కోసం ఒక

శిక్షకుడు, ఒక బోధకుడు, ఒక రచయిత, ఒక ప్రవక్త అయిన తానే ఒక ఘన వైద్యుడుగా రూపుచెందారు. "రండి. ఆర్తజనసేవలో మన హృదయాలు కరుగుతాయి. మన మనస్సులు వెలుగుతాయి. మన నిజ స్వరూపం మనకు బోధ పడుతుంది. మన కర్తవ్యం మనకు సాక్షాత్కరిస్తుంది" అంటూ అనుభూతి ప్రదమైన పిలుపును మంద్రమైన మార్గంలో ఇచ్చారాయన.

వారి పిలుపు జాతిని మేల్కొలిపింది. జాతి తాను మరచిపోయిన సహజీవనానికి తిరిగి శ్రీ కారం చుట్టింది. కులమతాలకు అతీతంగా, వర్గ పోరాటాలకు, ముఠా తగాదాలకు దూరంగా ప్రేమమార్గాన జీవించడం తిరిగి జాతికి అలవడసాగింది. తోటివాని ఆర్తికి స్పందించడం, తన తోటివారి కష్టసుఖాలను తనవిగా భావించడం భారతీయుడు తిరిగి అభ్యసించసాగాడు.

ఆయన వైద్యం చెయ్యవచ్చు. వేదాధ్యయనం నిర్వహించవచ్చు. రచనసాగించవచ్చు. సంస్కృతంనేర్పవచ్చు. శాస్త్రాలనువివరించవచ్చు. పురాణ ఇతిహాసాల మర్మాలను విప్పిచెప్పవచ్చు. విద్యాలయాలను నెలకొల్పవచ్చు. స్వయం ఉపాధి కల్పనలకై యువకులను ప్రేరేపించవచ్చు. ఇంకెన్నో చేయవచ్చు కాని వీటన్నిటినుండి ఆయన ఉద్దేశించింది మాత్రం ఒక్కటే. అదే జాతిపునర్నిర్మాణం.

ఒకసారి వారినడిగాను. 'మాష్టరుగారూ ! పునర్నిర్మాణ కార్యక్రమంలో మనమెంత వరకూ వచ్చాం !' అని.

ఆయనిలా అన్నారు ! "కొంతవరకూ వచ్చాం. ఇంకా జరగవలసింది చాలాఉంది. వైద్యాలయాలలో, విద్యాలయాలలో క్రతు నిర్వహణలో వ్యక్తులు కలసి బృందాలుగా పనిచేస్తూ ఉన్నారు. గురు

పూజలలో అంతరాలు మరచి ఆ మూడు రోజులూ ఒకరికొకరై ఆత్మీయత ననుభవిస్తున్నారు. ఇంతవరకు బాగుంది. ఇక ఇక్కడనుండే కొంచెం కష్టంగా కనిపిస్తోంది. జరగవలసినదెంతో ఉంది. అనేక కోణాలలో ఏకకాలంలో జాతిపునర్నిర్మాణానికై కృషి జరగవలసివుంది అన్నిటినీ మించి భారతీయునిలో ఆత్మవిశ్వాసం ఇంకా పెరగవలసివుంది. దానిని పెంచడం చాల కష్టంగా కనిపిస్తోంది. కాని చాల సమస్యలకు పరిష్కారం దానిపైననే ఆధారపడిఉంది. ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోవడం, క్రమశిక్షణను తానుగా కోరి అభ్యసించడం అలసత్వాన్ని వదలి జీవితాన్ని సర్వతోముఖంగా వికసింపజేసి సమాజ శ్రేయస్సుకై సమర్పించగలగడం ముఖ్యమైన ఈ మూడు లక్షణాలు భారతీయునిలో నిండుగా చూడగలిగిననాడు ఈ పునర్నిర్మాణ కార్యక్రమం ఒక కాలిక్కి వచ్చిందని మనం అనుకోవచ్చు. చూద్దాం! మనకు ముందు ఎందరో పెద్దలు ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తూ వచ్చారు. ఇప్పుడు మన మీదుగా సాగుతున్నది. ఇంకాసాగవలసినదెంతో ఉంది. మనవంతు బాధ్యతను మనం ఏమరుపాటు చెందకుండా నిర్వహించడమే ఇప్పటికి మన కర్తవ్యం."

మరొకసారి ఇద్దరమూ మాట్లాడుకుంటున్నప్పుడు "మాష్టరు గారూ! ఒక చిన్నమాట చెప్పనా?'' అన్నాను. తప్పకుండా చెప్పు అన్నారాయన.

నేనిలా అన్నాను. "మంచికే జరిగిందో, చెడుకే జరిగిందో నేను చెప్పలేను కాని భారతదేశానికి సంబంధించినంతమటుకు కృష్ణమాచార్య గారు అంటే ఒక గొప్ప హోమియోవైద్యుడు అనే ఎక్కువ మంది అభిప్రాయం. పాశ్చాత్యులు దర్శించినట్లుగా ఒక ప్రవక్తగా మిమ్మల్ని దర్శించి సద్వినియోగ పరచుకొంటున్న వారి సంఖ్య మన

దేశంలో తక్కువనే చెప్పాలి. మన జాతి మీ నుండి ప్రయోజనాన్ని కోరుతున్నంతగా పరమార్థాన్ని కోరడంలేదేమో ననిపిస్తోంది. దీనితో ఏమయింది? మీ నుండి నడుస్తున్న ఉద్యమానికి కూడా ఒక సేవా ఉద్యమంగా పేరువచ్చినంతగా ఒక జాతీయ ఉద్యమంగా పేరుపడలేదు. జాతీయ ఉద్యమంగా పేరు పడనప్పుడు మరి మన మాశించిన ప్రయోజన మెలా సిద్ధిస్తుంది?"

ఒక్క క్షణం ఆలోచించి ఆయనిలా అన్నారు. "నిజమే నీవన్నది. మనమాశించిన ప్రయోజనాన్ని సమగ్రంగా సాధించడానికి ఈ వేదికక చాలదేమోననిపిస్తోంది. దీని ప్రయోజనం పరిమితత్వాన్ని పొందింది. ఆ పరిమితమైన ప్రయోజనం మాత్రమే దీని ద్వారా సాధింపబడుతుంది."

"మీ ప్రణాళికకు ఈ వేదిక చిన్నదైనప్పుడు ఇక ఇప్పుడేం చెయ్యాలి?"

"కాలమే నిర్ణయిస్తుంది. కాలం జరుగుతున్న కొద్దీ ఈ వేదిక రూపు కట్టుకున్నట్లె మరొక వేదిక రూపు కట్టుకొనవచ్చు. ఏది ఏమైనా మనమాశించిన పరమ ప్రయోజనాన్ని సాధించడానికై ఉద్దేశించిన మన ఈ ప్రయాణం సాగుతూనే ఉంటుంది. ప్రయాణవేగం మరింత పెరుగుతుంది తప్ప తగ్గదు. దానికై ఎప్పుడెప్పుడు మనమేం చేయాలనేది కాలమే మనకు సూచిస్తూ మనచేత చేయించుకుంటుంది.

ఈ ప్రయాణం దీర్ఘమైనది కనుక ఈ దేహాలు మారవచ్చు. దేహాలు మారినా వేదికలు మారినా ప్రయాణం మాత్రం ఒక్కటే. ఇది మనం గుర్తుంచుకొనవలసి ఉంటుంది ఈ సత్యం మనకు గుర్తున్నంత వరకు దేహాలు,వేదికలు ఉపకరణాలుగా మనకుపయోగపడుతూఉంటాయి. ప్రస్తుతానికి ఇంతకన్న ఏం చెప్పగలను?

నీవు గ్రహించవలసింది ఒక్కటే. సన్నివేశాలను చూచినిరుత్సాహ పడవలసిన పనిలేదు. సన్నివేశాలనుండి సత్యదర్శనాన్ని అందుకుంటూ కర్తవ్యోన్ముఖులమై ముందుకు సాగడం మనకు చేతకావాలి. అది చేతనయితే అంతా ఉత్సాహమే. అది చేతగావడానికే ఈశిక్షణంతా" అన్నారాయన.

ఆయనకన్నులు మిలామిలా మెరుస్తున్నాయి విషాదయోగంనుండి వివేకపథంలోకి అర్జునుణ్ణి నడిపిస్తున్న కృష్ణునిలా కన్పించారాయన.



1984 మార్చి 16 దాటి 17 ప్రవేశిస్తుండగా మాష్టరుగారు తమ భౌతికదేహాన్ని విడిచిపెట్టి సూక్ష్మలోకాలలోనికి ప్రవేశించారు. అది ఒక అనుకోని పరిణామం ఒక హఠాత్ సంఘటన పండ్రెండు సంవత్సరాలుగా సాగివస్తున్న మా సాహచర్యానికి ఒక భరించలేని విఘాతం నేను మ్రాన్పడి పోయాను. ఇది కలా? నిజమా? నేనిక నిలబడగలనా? అసలు నిలబడటం మాత్రం ఎందుకు? అని నామనస్సు ఘోషించ సాగింది

"నేనెప్పుడూ నీతోనే ఉన్నాను. నీవిప్పుడు చూడవలసింది. మన ప్రణాళిక వైపు, నేనుదేహాన్ని విడిచానని విలపిస్తున్నావు గదా? మరి ఈ 'నీవు' దేహంతో ఉన్నందుకు దానిని సద్వినియోగం చేయవద్దా? లే! ముందుకుసాగు!" అన్న సందేశం వినిపించి నన్ను నిలబెట్టింది ముందుకు నడిపించింది.

ఆ పైన వివిధ ప్రాంతాలలో మాష్టరుగారి దివ్య సంస్మరణ సభలు జరిగినాయి. దాదాపు ప్రతి సభలోను నేను మాట్లాడటం జరిగింది మాట్లాడిన ప్రతిచోటా మాష్టరుగారి జాతి పునర్నిర్మాణ ప్రణాళికే

నాగొంతునుండి ధ్వనించింది. ప్రజలందరు ఈ పునర్నిర్మాణ ప్రణాళికకు ఎంతగానో స్పందించడం నేను గమనించాను.

మాష్టరుగారు అన్నట్లుగానే కాలం జాతిపునర్నిర్మాణానికి అనుకూలంగా మలుపు తిరుగుతుందా! అనిపించింది నాకు. ఏమో! ఏదో మలుపు తిరుగుతోంది. ఇక మనము ఆ మలుపుకు సిద్ధం కావాలి అని అనిపించింది. లోనుండి వినిపించింది.

85 జనవరి గురుపూజలలో తెనాలినుండి వచ్చిన కృష్ణప్రసాద్ నన్ను కలిశాడు. సంస్మరణ సభలో మీరు ప్రస్తావించిన జాతి పునర్నిర్మాణ కార్యక్రమం తెనాలి ప్రజలకు ఎంతగానో నచ్చింది. కృష్ణ స్వామిగార్ని అడిగి ఒక ఏడు రోజులపాటు జాతి పునర్నిర్మాణాన్ని గురించి వారి ప్రవచనాలను మనమెందుకు ఏర్పాటుచేసుకోగూడదు అని వారంటున్నారు. మీరు తప్పక అంగీకరించాలి. మీరంగీకరిస్తే ఇక ఏర్పాట్లు మొదలైపోతాయి. అని అంగీకారం కోసం ఎదురు చూస్తున్న చూపులతో నిలబడ్డాడతను.

నాకు కొంచెం ఆశ్చర్యం వేసింది. మలుపు వస్తున్నమాట నిజమేననిపించింది.

మనం రామాయణ సప్తాహాలు ఎరుగున్నాం. భారత సప్తాహాలు, గీతా సప్తాహాలు మొదలైనవి చూస్తున్నాం ఇప్పుడు వీరు జాతి పునర్నిర్మాణ సప్తాహాన్ని కోరుతున్నారు. అంటే నాజాతి పునర్నిర్మాణ ప్రణాళికను కోరుతున్నదన్నమాట. పునర్నిర్మాణానికి ఇష్టపడుతున్న

గన్నమాట. అని అనుకుంటూ సంతోషం, అంతకన్న కావలసిందే ముంది? తప్పకుండ వస్తాను అన్నాను.

1985 ఫిబ్రవరి 12 నుండి 18 వరకు తెనాలి కన్యకా పరమేశ్వరీ దేవాలయ ప్రాంగణంలో జాతిపునర్నిర్మాణానికై ఏడు రోజుల పాటు ఏకధాటిగా శంఖారావం వెలువడింది. ఆ శంఖారావానికి ఆబాల గోపాలం స్పందించి నిలబడింది.

ఒక ఎనభై ఏళ్ళ వృద్ధు సమీపించి అడిగాడు నన్ను ఈ కార్యక్రమంలో నేనేం చేయగలను? అని.

స్త్రీ మూర్తులు కొందరు ఒక లేఖ పంపారు. ఈ పునర్నిర్మాణ కార్యక్రమంలో మేం పోషించవలసిన పాత్రయొక్క వైఖరులేమిటో మరింత స్పష్టం చేయండని.

బాల బాలికలు కొందరు చేరవచ్చి మురిసి పోయారు. గాంధీ మహాత్ముడ్ని గూర్చి తాము విన్నది తమకెంతో నచ్చిందని.

మాష్టరు గారి మాటలు నాచెవిలో మారుమ్రోగసాగాయి. "మన మేం చేయాలన్నది కాలమే మనకు సూచిస్తుంది. మనచేత చేయించు కుంటుంది" అని.

తెనాలి నుండి విశాఖచేరేలోపుననే కొన్ని చిత్రమైన సన్నివేశాలు నడిచి 'మానవధర్మ శిక్షణసంస్థ' వెలిసింది. భారతజాతి పునర్నిర్మాణానికీ ప్రపంచ జాతులకు సహజీవన విధానాన్ని అందించడానికీ ఈ వేదిక అవతరించిందని ప్రకటించబడింది.

"మన ప్రయాణం వేగంగా సాగడానికి ఈ వేదిక ఎంతైనా ఉప కరిస్తుంది. మనం ఉద్దేశించిన పరమార్థాన్ని సాధించడానికి కావలసిన అవకాశాన్ని ఈ వేదిక మనకు చక్కగా అందిస్తుంది. ఈ వేదిక రూపంలో నేను నీతో ఉంటాను. ఈ మన సాహచర్యం నిరాఘాటంగా, నిరంతరం కొనసాగేదేనని నీవు గుర్తుంచుకో. ఒకప్పుడు దేహంతో నీతో సహచరించాను. ఇప్పుడు ఈ వేదికను ఆలంబనంగా చేసికొని నీతో సహచరిస్తాను. దివ్యమైన ఈ వేదికనే నా స్వరూపంగా దర్శిస్తూ నీవిక కర్తవ్యోన్ముఖుడవు కావలసి ఉన్నది. ఈ మన సాహచర్యం సార్థకమూ, చరితార్థమూ కాగలదు" అని మాష్టరుగారు వెన్నుతట్టి చెప్పినట్లయింది.

మానవ ధర్మ శిక్షణ సంస్థ ప్రారంభం కాగానే వివిధ ప్రాంతా లలో రూపొందుతూ వస్తున్న సోదర బృందాలకు, సందేశాన్ని, విశేషా లను అందించడానికి ఒక ఉపకరణం అవసరమయింది. 'శంఖారావం' అనే బులెటిన్ వ్యక్తమయింది.

నెల నెలా వెలువడే శంఖారావంలో ఏ నెలకు ఆ నెల విశేషాలతో బాటు, ఆ నెలలో జరిగిన ప్రసంగాలనుండి తగిన ప్రసంగాన్ని సందే శంగా ప్రచురించడమనేది ప్రారంభమయింది. గత రెండు సంవత్స రాలుగా శంఖారావంలో ప్రచురించబడిన సందేశాలే ఇప్పుడీ గ్రంథంగా రూపుధరించాయి. పునర్నిర్మాణానికై వెలువడుతున్న శంఖారావం గ్రంథరూపాన్ని ధరించి నేల నాలుగు చెరగులకూ వ్యాపించదలచిం దన్న మాట.

ఈ పునర్నిర్మాణానికి శంఖారావం వెనుక ఇంతకథ ఉంది. అక్కడికీ నేను తగు మాత్రమే మీ ముందుంచాను. విస్తృతంగా చెప్పవలసిన చోట చెబుతాను.

కొన్ని దశాబ్దాలుగా జాతిలో రావలసిన మార్పుకోసం తపనతో కృషి చేస్తున్న మన్నవ గిరిధరరావు గారు ముందుమాట వ్రాసి ఈ గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్నందుకు సంతోషంగా ఉంది.

ఈ శంఖారావం పెద్ద ఎత్తున వెలువడటానికి నిమిత్తంగా నిలబడినది రాజశేఖరుని కృష్ణప్రసాద్, అతని దివ్యస్మృతిగా ఈ గ్రంథం నిలచిపోతుంది.

విజయవాడ
24-5-88

మోపిదేవి కృష్ణస్వామి

—0—

## ఇది సత్యం

ఏడుకొండలపైన వేంకటేశ్వరుడు యుగాలతరబడి ఒకేలా నిలిచి ఉంటున్నాడు. ఒకేరకమైన అనుగ్రహాన్ని వెదజల్లుతూ ఉన్నాడు. అయితే మానవుడే ఒక్కొక్క శతాబ్దంలో ఒక్కొక్కలా ఆయన సన్నిధిలో ప్రవర్తిస్తున్నాడు. ఆ వేంకటేశ్వరుడు విగ్రహం దగ్గర పదహారవ శతాబ్దం మానవుడు ఎలా ప్రవర్తించాడు? 17, 18 శతాబ్దాలలో మానవుడు ఎలా ప్రవర్తించాడు? యిప్పుడు యీ శతాబ్దంలో ఎలా ప్రవర్తిస్తున్నాడు అనేది వెనక్కి తిరిగి చూచుకొంటే మనకు తప్పకుండా అవగతమతుంది. ఇన్ని శతాబ్దాల మానవులతో పోల్చుకొంటే మనం ఏ స్థితిలో ఆయన ముందు నిలుచున్నామో కూడా బోధపడుతుంది. చెడిపోయింది మనమో గుడి గోపురాలో కూడా యిట్టే తెలుస్తుంది. చెడిపోయింది గుడి గోపురాలు కాదు వాటిని వినియోగించుకొంటున్న మానవుడేనని స్పష్టంగా బోధపడుతుంది. బోధపడిన తరువాత మనంగా, సర్దుకోవడం ఒక పద్ధతి. ఇది మంచి పద్ధతి. ఇది చేయకపోతే ఈనాడో రేపో,ఏదో ఒక రూపంలో వాడే మనని సర్ది శాసిస్తాడు. ఇది సత్యం.

  

## సజీవ విగ్రహారాధనకై కదలి రండి

క్రొత్తగా గుడి గోపురాలు నిర్మాణం చెయ్యాలని చూడడం కన్నా యిప్పుడున్న గుడి గోపురాలను శ్రద్ధగా చూసుకోవడం మిన్న. అది మనకు చేతనైతే అంతకన్న కావలసింది లేదు. శిథిలావస్థలో వున్న గుడిగోపురాలను పునర్నిర్మాణం చేసుకోగలిగితే క్రొత్తగా నిర్మించిన దానికన్న వేయిరెట్లు అనుభూతిని మనం పొందగలుగుతాం. ఒకప్రక్క పాతవాటిగోడలు పడిపోతూ ఉంటే మరొక ప్రక్క కొత్తగా కట్టాలనుకోవడం వివేకవంతమైన పనిగాదు. గుడి లేనిచోట కడదాం. ఉన్నచోట బాగు చేసుకొందాం. ఈ సూత్రాన్ని మనం స్వీకరించాలి.

ఈనాడు గుడులలో జరుగుతున్నది అర్చనా? లేక ఆర్జనా? హారతి దగ్గరనుండి ప్రసాదం వరకు రేట్లు పెట్టిన ఘనత మనది. ఒక్కసారి ఈ గుడి గోపురాలు మనకు నిర్మించి యిచ్చిన మన పూర్వులు పైనుండి గనక క్రిందకు చూస్తే ఈ దేవాలయాల దీనస్థితిని చూచి, వాళ్ళెంత క్షోభననుభవిస్తారో కొంచెం ఊహించండి. ఈ గుడి గోపురాలు నిర్మించి యీ మడి మాన్యాలు ఏర్పాటు చేసింది యిందుకేనా అని వాళ్ళ గుండెల్లో గుడి సుళ్ళు తిరిగిపోవూ!

అసలీ గుడిగోపురాలు ఎందుకేర్పడినాయి? ఈ విగ్రహారాధన ఎందుకు రూపుదిద్దుకుంది? ఆలయ సంప్రదాయం నుండి మన పెద్దలు నిర్దేశించిన ప్రయోజనం ఏమిటి? విగ్రహారాధన సజీవ విగ్రహారాధనగా

పరిణమించడమే వారుద్దేశించిన పరమావధి. జీవరాసుల రూపంలో గోచరిస్తున్న దైవాన్ని ఆరాధించడానికిగాను క్రమబద్ధమైన శిక్షణనిచ్చేటందులకే యీ గుడిగోపురాలు, ఈ దేవతార్చన కార్యక్రమమూ. అది జరుగనప్పుడు సంప్రదాయం తాత్కాలికంగా నవ్వులపాలు కావలసి వస్తుంది. మన ఆరాధన సజీవ విగ్రహాల వరకు కొనసాగనప్పుడూ, గుడికి మాత్రమే పరిమితమైనప్పుడు, అక్కడ కూడా ధనమే దైవంగా గోచరిస్తున్నప్పుడు నవ్వులపాలు కావడంలో ఆశ్చర్యమేముంది? ఒక ఊళ్ళో ఒక బృందం నాటకానికి రిహార్సల్సు వేసుకొంటున్నారు. బాగున్నదని ఒక షావుకారుగారు కొట్టు కట్టేసి వెళ్ళిపోతూ రోజూ పెట్రోమాక్సులైటు అక్కడపెట్టి వెళ్ళేవాడు. ఒక టీ కొట్టువాడు చక్కగా టీ చేసి ఉచితంగా అందించేవాడు. ఒకరిద్దరు కుర్రవాళ్ళు టీని గ్లాసులలో పోసి చక్కగా రిహార్సల్సు చేస్తున్నవారికి అందించేవారు. కొన్నాళ్ళయింది. ఎప్పటికీ వారు నాటకం వేయరు. చూసి, చూసి ఒకాయన అడిగాడు. నాటకం వేసే వుద్దేశ్యం వాళ్ళకు లేనట్లు తెలిసింది. అంతే, లైటు రావడం మానింది. టీ అందడం మానింది. అందించే కుర్రవాళ్ళుకూడా ఆ ఛాయల్లో మళ్ళీ కనబడలేదు. అలాగే గుడిగోపురాలలో మనం చేస్తున్న విగ్రహారాధన సజీవవిగ్రహారాధనకు గాను మనంవేసుకొంటున్న రిహార్సల్ లాంటిది. సజీవ విగ్రహారాధన జరుగుతున్నకొద్దీ యీవిగ్రహారాధన సంప్రదాయం గౌరవింపబడుతుంది. లేనప్పుడు ఎగతాళి చేయబడుతుంది. అదిసహజం. జరుగవలసిందే కూడాను. మనం మరచిపోయిన వాస్తవాన్ని గుర్తుచేయడానికే దైవం ఆరూపంలో ఎగతాళి చేస్తున్నాడు. అని మనం గ్రహించాలి. అర్జున

దృష్టినుండి అర్చన దృష్టికి మనని మనం మళ్ళించుకోవాలి. తోటి వ్య_క్తి
ఎడల నిర్వహించవలసిన కర్తవ్యాన్ని అర్చనగా, ఆరాధనగా, సమర్పణ
బుద్ధితో నిర్వహించగలగడం మనం చేస్తున్న విగ్రహారాధనకు గమ్యం.
ఆ విగ్రహారాధనకు మరొక్కసారి స్వాగతం పలకడానికే ఈ మానవ
ధర్మ శిక్షణ సంస్థ. సజీవ విగ్రహారాధనకై సాగి రమ్మని ఈ సంస్థ
తోటి సోదరులను సాదరంగా ఆహ్వానిస్తోంది.

  

## మరో స్వాతంత్ర్యోద్యమానికి సిద్ధం కండి

ఇంగ్లీషు వాళ్లని హడలుగొట్టి, వెడల గొట్టి మనము సాధించు
కొన్నది భౌతికమైన స్వాతంత్ర్యాన్ని మాత్రమే. మానసికమైన
స్వాతంత్ర్యాన్ని మనమింకా సాధించుకోవలసి ఉంది. స్వాతంత్ర్యం
వచ్చింది మనగడ్డకు గాని, మన మనస్సుకు కాదని ఈ కొద్ది కాలంలో తెలిసి
పోయింది. భారతీయుడు మానసికంగా ఇంకా బానిసే. బానిసగానే అతడు
బ్రతుకుతున్నాడు. బ్రతకడానికి ఇష్టపడుతున్నాడు. తోటివ్యక్తిని
ఆశ్రయించి అయినా బ్రతుకుతాడు లేదా అహంకరించి అతనిపై పెత్త
నం చేసైనా బ్రతకాలనుకుంటాడు. ఆత్మీయంగా మాత్రం పలకరించ
లేడు. సమానంగా మాత్రం చూడలేకపోతున్నాడు. భారతీయుడు తోటి
భారతీయుణ్ణి ఆత్మీయంగా పలకరించి సమానంగా స్వీకరించగలిగిననాడు

మాత్రమే మనకు నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లు లెక్క. ఇప్పుడు మనం మరో స్వాతంత్ర్యోద్యమానికి సిద్ధం కావలసి ఉంది.

భౌతికమైన సంకెళ్ళను ఊడగొట్టడానికే ఎందరో మహానుభావులు ఎన్నోవైపుల నుండి తమ జీవితాలనే తపస్సుగా ధారపోయవలసి వచ్చింది. ఇప్పుడు మనం ఊడగొట్టవలసిన సంకెళ్ళు మనస్సుకు వేయబడినవి. ఇదింకా సూక్ష్మమైన అంశం. ఈ సంకెళ్ళు విడిపోవడానికి ఒక ప్రత్యేకమైన మార్గంలో మనం ఎంతగానో కృషి చేయవలసి ఉంటుంది. అలాంటి కృషికి మన మనస్సులు అంగీకరించి మనమిప్పుడు సిద్ధం కావలసి ఉన్నది. ఎంతో వేగంగా ఎంతో సూక్ష్మంగా, ఎంతో సూటిగా మరెంతో సున్నితంగా మన కృషి ఉద్యమ రూపం దాల్చి విజృంభించవలసి ఉంది.

ఇది అల్లూరి సీతారామరాజు తిరుగాడిన ప్రాంతం. ప్రారంభమైన ఈ ద్వితీయ స్వాతంత్ర్య ఉద్యమానికి తగిన స్ఫూర్తిని పొందడానికి బృందంతో ఇంత దూరం తరలి వచ్చాను. అతడు తిరుగాడిన స్థలాలు, శిలా విగ్రహాలు, అతడి స్మారక చిహ్నాలు చూశాను. ఎంతో స్ఫూర్తిని పొందేను. ఆ పొందిన స్ఫూర్తి నుండి మరో స్వాతంత్ర్య ఉద్యమానికై మరింత గట్టిగా పిలుపునిస్తున్నాను.

సోదరులారా ! ఆ స్వాతంత్ర్య సమర యోధులకు మనము అంజ ంచగల మార్గమిదే . మానసిక స్వాతంత్ర్యాన్ని మనం సాధించుకోగలిగినపుడే ఆ మహాత్ములు మనకందించిన దేశస్వాతంత్ర్యం సార్థక

మవుతుంది. ఆ మహనీయులు దేశస్వాతంత్ర్యం కోసం పడిన పాట్లకు, చేసిన తపస్సుకు కృతజ్ఞత తెలుపుకోవలసింది మరో స్వాతంత్ర్యాన్ని, మానసిక స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడం ద్వారా మాత్రమే. కదలి రండి ! కలిసి నడుద్దాం !

  

## రైలు ప్రయాణానికి రెండు పట్టాలూ ఉండాలి !

పెద్దల ప్రవచనాలు విన్నప్పుడు ప్రాణానికి చాలా హాయిగా ఉంటుంది. విన్న కొంతసేపటికి మళ్ళీ మామూలు అయిపోతుంది. మనస్సు మామూలుగానే పడుతూ లేస్తూ తాపత్రయాన్ని అనుభవిస్తూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఎన్ని విన్నా ఏమి ప్రయోజనం అలా ఉండలేనప్పుడు అనిపిస్తూ ఉంటుంది. అలా ఉండడం మీకు చేత కానప్పుడు ప్రత్యేకించి వెళ్ళి వినడం కూడా ఎందుకు ? అని మన తోటి వాళ్ళు కొందరు మనని విమర్శిస్తూ కూడా ఉంటారు. నేరుగా ఆలోచిస్తే ఏమిటో బాధగా ఉంటుంది. పెద్దలను చూచినప్పుడు గాని, పెద్దల జీవితాలను స్మరించినప్పుడు గాని ఆ పెద్దల జీవిత సన్నివేశాలను గూర్చి ముచ్చటించుకొన్నప్పుడు గాని హాయిగా ఉండి మనం కూడా అలా ఉంటే బాగుండును అని అనిపిస్తోంది గదా ! మరి ఎందుకని అలా ఉండలేక పోతున్నాము అన్న వేదన కలుగుతూ ఉంటుంది.

అలా జీవించాలని మనకు ఇచ్ఛ ఉన్నప్పటికి దానికి సహకరించ వలసినది మన శరీరం, మనస్సు, ఇంద్రియాలు. పెద్దల గురించి ప్రస్తా వించుకొన్నప్పుడు మనస్సు, ఇంద్రియాలు మనలోనికి కరిగిపోతాయి. శరీరం ఒక విధమైన అనుభూతి స్థితిని అనుభవిస్తుంది. ముచ్చటించు కోవడం అయిపోయిన కొంతసేపటికి మనస్సు ఇంద్రియాలు వాటి స్పృహలోనికి వస్తాయి. వాటి ప్రకారం అవి ఉండడం మొదలు పెడ తాయి. మన ప్రకారం అవి ఉండాలి అంటే మనం యోగసాధన చేయ వలసి ఉంటుంది. మనస్సును ఇంద్రియాలను దేహాన్ని కావలసిన క్రమ శిక్షణలోనికి తీసికొనిరావడానికే యోగసాధన. అలా తీసికొని వచ్చి నప్పుడు మనం విని పరవశించి పెద్దలవలె మనం కూడా జీవించడానికి వీలవుతుంది. పెద్దల జీవితాలు స్మరించుకొంటూ ఉండడం భాగవత మార్గం. ఆ మార్గాన మనం జీవితం నడపడానికి మనం చేయవలసినది యోగసాధన.

ఒక్క భాగవత మార్గాన్ని మాత్రమే అవలంబించినప్పుడు యోగ సాధన కరవు అవడంతో జీవితంలో కలిగిన దివ్యానుభూతి నిలబడదు. ఒక్క యోగసాధన మాత్రమే చేసినప్పుడు మనస్సు, ఇంద్రియాలు, దేహం దారిలోకి వస్తాయి గాని వచ్చిన వాటితో ఏం చేయాలో అంతగా తెలియదు. కారణం, పెద్దల జీవితాంశాల స్మరణ అనే భాగవత మార్గం అక్కడ లేకపోవడమే. చిత్రం ఏమిటంటే భాగవత మార్గాన అనుభూతి చెందేవారు యోగసాధనపై దృష్టి పెట్టరు. యోగసాధన ద్వారా శరీరాన్ని వశంలోకి తీసికొని వస్తున్నవారు భాగవత మార్గం పై శ్రద్ధచూపరు. భాగవత మార్గం, యోగసాధన రెండు పట్టాలు కాగా

జీవితం రైలు ప్రయాణంగా సాగవలసి ఉంది. ఇందులో ఏ పట్టా లేక పోయినా రైలు ప్రయాణం లేదు. కనుక ఏక కాలంలో యీ రెండింటి యందు నిష్ఠ కుదిరినవాడు ధన్యుడు. పెద్దల గురించి చెప్పుకొంటూ, ఆ చెప్పుకుంటున్న ప్రకారం జీవించడానికి మన శరీరాన్ని సిద్ధపరచు కొంటూ మనం ముందుకు సాగవలసి ఉంది.

  

## నిజస్థితిని గ్రహించండి

దేవుని గుడి ఊరికి గుండెకాయవంటిది. మనలో గుండె ఏమి చేస్తున్నది? శరీరంలోని రక్తం అంతా గుండె చుట్టూ తిరుగుతున్నది. మలినమైన రక్తం గుండెను చేరి శుభ్రపరుచబడి మళ్ళీ శరీర భాగాలకు ప్రయాణం చేస్తున్నది. అలాగే అలసి సొలసిన గ్రామస్థులు సాయంత్రమయ్యేటప్పటికి దేవుడి గుడికి చేరి తమతమ శరీర కోశాలను పునీతం చేసుకొని తిరిగి ఇళ్ళకు చేరుకొంటున్నారు. ఉదయం గుడిలో నమస్కరించుకొని పనిలోనికి దిగడం, సాయంత్రం గుడికిచేరి ప్రశాంతతను పొందడం చేస్తూ గ్రామస్థులు తమ జీవితాలను సార్థకం చేసికోవడానికే గుడి అన్నది మన పెద్దలచేత ఏర్పాటు చేయబడింది.

ఈగుడి అందరి యిల్లు. ఇక్కడ శాఖాభేదాలు, కులభేదాలు లేవు. అందరూ ఆయన బిడ్డలే. కులమత భేదాలకు అతీతంగా మనిషి మనిషిగా

నిలబెట్టి దేవుని పుత్రునిగా రూపుదిద్దడానికే ఉన్నది ఈ గుడి. ఎవరికి వారుగా కాక ఒకరికి ఒకరుగా ఒకే వెలుగుగా జీవించడానికి కావలసిన వికాసాన్ని, శిక్షణను అనుభవించడానికే యీ గుడి సంప్రదాయం రూపు కట్టుకున్నది.

ఏమరుపాటుకు గురి అయిన మనం ఏమిచేయాలో తెలియక ఈ గుడులను వ్యాపార-కేంద్రాలుగా, కాలక్షేప నిలయాలుగా మార్చుకుంటున్నాము. గుడి ఒక బడి ఒక అధ్యయన కేంద్రం ఒక శిక్షణ అని మనం గుర్తించవలసి ఉంది. చిన్న పిల్లలకు యిక్కడ కావలసిన విద్య అందించబడాలి. యువకులకు జీవిత నిర్వహణకు కావలసిన శిక్షణ యిక్కడ అందాలి. మధ్య వయస్కులకు వారి సమస్యలకు వలసిన పరిష్కారం యిక్కడ లభించాలి. వృద్ధులకు వారు కోరుకొనే చిత్త శాంతి యిక్కడ దొరకాలి. ఇలా ఆబాలగోపాలానికి ఆట పట్టై గుడి వర్ధిల్ల వలసి ఉంది. ఏ స్తోత్రపాఠాలకో ఏ తైల అభిషేకాలకో మాత్రమే యీ గుడులు పరిమితమై పోకూడదు. అలా అయిపోవడం మనదౌర్బల్యానికి చిహ్నం, మన అలసత్వానికి నిదర్శనం.

ఈ గుడిని గూర్చి మనకు తెలియవలసిన పరమార్థం యింకా ఎంతో ఉంది. మన దేహానికి ప్రతిబింబంగా యీ గుడిని తీర్చిదిద్దారు మన పెద్దలు. మన నిజస్వరూపానికి ప్రతీకగా, యీ గుడిలో దైవాన్ని ప్రతిష్ఠించారు. ఈ గుడిలో శిక్షణ పొందడంద్వారా మానవుడు పొందవలసిన దర్శనం ఏమిటి అంటే దేహమే దేవాలయమని, అందలి జీవుడే సనాతనుడైన దేవుడనీ. ఇది మన పెద్దల ఆశయం. గుడి గోపురాల నుండి వారుద్దేశించింది యిది.

  

## అసంతృప్తి నుండి అసలు తృప్తికి

ఇదివరకటిమీద మనకు సౌకర్యాలు పెరిగాయి. సుఖపడడానికి కావలసిన హంగులెన్నో రూపు ధరించాయి. వాటిని అమర్చుకొనేటందుకు గాను సంపాదన కూడా పెరిగింది. కాని చిత్రం! మనిషి సుఖపడలేక పోతున్నాడు. ఏదో తెలియని అశాంతి, అసంతృప్తి అతన్ని వెన్నాడుతోంది. జీవిత ప్రయాణంలో ఊరికే అలసిపోతున్నాడతను. దీనికి కారణం ఏమిటి? ఆలోచించవలసిన అంశంగదా! యిది.

కారణం చెప్పనా? పై వాటన్నింటిని సమకూర్చుకోవడంలో పడి అతడు తోటి మనిషికి దూరమయిపోతున్నాడు. జీవిత ప్రయాణంలో తనకు తెలియకుండానే తాను ఒంటరివాడయిపోతున్నాడు. అన్న నుండి తమ్ముడు, భర్త నుండి భార్య, యజమాని నుండి సేవకుడు తమను తాము వేరుగా చూచుకొంటున్నారు. ఆ చూసుకోవడంలో ఏదో సాధించామనుకొంటూ ఒంటరితనాన్ని వరిస్తున్నారు. వరిస్తున్నారుగాని భరించలేకపోతున్నారు. ఆ మానసిక వంటరితనమే యీనాటి మనలోని అశాంతికి, అసంతృప్తికి కారణం.

ఇది తెలియక కారణం ఇంకెక్కడో ఉందని వెతుకుతున్నాడు మానవుడు. మళ్ళీ మనిషికి మనిషి దగ్గరయితే, మనిషికి వస్తు

సముదాయం కన్నా తన తోటి మనిషి ముఖ్యమని తెలిస్తే, అశాంతి పోయి ప్రశాంతి నిలుస్తుంది. అసంతృప్తికి బదులు అసలు తృప్తి నిండుతుంది. ఇప్పుడుమనం అనుభవిస్తున్నదదే.

ఒకప్పుడు గ్రామాల్లో యిలాంటి దివ్యజీవనమే ఉండేది. ఒకళ్ళ నొకళ్ళు బాబాయి, మామయ్యా అని వరసలుపెట్టి పిలుచుకొంటూ కుల భేదాలకు అతీతంగా ఎడతెగని ఆత్మీయతను తరాల తరబడి అనుభవించే వారు. మా వూరి అమ్మాయి, మా వూరిఅల్లుడు అంటూ మురిసిపోయేవారు. పాశ్చాత్య నాగరికతా ప్రభావం మనపై పడడంవల్ల పదవీ రాజకీయాలు కులతత్వాలను రెచ్చగొట్టడం వల్లా, పద్ధతిలేని చదువులు అంతరాలను సృష్టించడం వల్లా మనం ఆ దివ్యజీవనానికి దూరం అయ్యాము. మళ్ళీ యిప్పుడు మిమ్మల్ని యిక్కడ బృందంగా చూస్తూ ఉంటే దూరం అయిన ఆ దివ్యజీవనానికి మరొక్కసారి మనం నోచుకోగలుగుతున్నాం అన్న తృప్తి కలుగుతోంది. మళ్ళీ ఇలా ఒక్కొక్క కాలనీ ఒక్కొక్క గ్రామమై కావలసిన మార్పును తెచ్చుకోవాలి. అలాంటి మధురమైన మార్పు జాతిలో తిరిగి తీసికొని రావడానికే మాష్టరుగారిలాంటి మహనీయులు ఇలాంటి సంస్థలను నెలకొల్పుతున్నదీ, నడుపుతున్నదీ.

నేనొక వంటవాడిని. మీ ఇంట్లో ఏదైన శుభకార్యం వచ్చినప్పుడు వంటవాడేం చేస్తాడు? ఒక పెద్ద అట్లకాడను మాత్రం తనతో తీసికొని మీ ఇంటికి వస్తాడు. సరుకులన్నీ మీరే ఇస్తారు. సరంజామా అంతా సమకూరుస్తారు. ఏమేమి చేయాలోకూడా మీరే చెప్తారు. అతడవన్నీ చక్కగా చేసిపెట్టి మీతోబాటు తనుగూడా ఆనందంగా భోంచేసి వీడ్కోలు

అందుకొంటాడు. అలాగే నేనొక గొంతుతో వచ్చాను. ఆ గొంతుతో ఎక్కడికక్కడికి కావలసిన సమన్వయాన్ని అందిస్తూ సాగిపోతూ ఉంటాను. నా ఎదురుగా నున్న సన్నివేశాలను సమన్వయించి అందించడమే నా వంతు. అందుకే ఉన్నది యీ గొంతు. మిమ్మల్ని నాలో చూచుకొంటూ, మీకు కావలసింది చెప్పుకొంటూ మీకు చేయవలసింది చేసికొంటూ సాగిపోవడమే ఈ నా రాకకు పరమావధి.

  

## మాస్టరుగారి పిలుపును అందుకొనండి

గురుత్వము అనగా పెద్దరికం. మానవజాతికి పెద్దరికం వహించి ఆయా శతాబ్దములలో సారథ్యము వహించిన వారినందరినీ మనము గురువులని పిలవవలసి యున్నది. అట్టి పెద్దలందరినీ ఒకచోట మనకు సాక్షాత్కరింపజేయునదియే గురుపూజా వేదిక.

కొంచెం దగ్గరగా చూచినప్పుడు నిజమునకు పెద్దలందరు లేరనియు, ఒకేపెద్ద ఆయా దేశములకు తగిన మూర్తిని ధరించి మనను ముందుకు నడుపుతున్నాడనియు బోధపడగలదు. ఆ ఒకే పెద్దను అనాదిగా అంతర్యామి లేక జగద్గురువు అని పిలుచుచున్నారు. ఆ ఒకే పెద్దను, ఇన్ని మూర్తుల రూపమున దిగివచ్చుచున్న ఆ జగద్గురువును అర్చించుకొనుటకే ఈ గురుపూజలు.

ఆయా కాలములలో, ఆయా దేశములలో ఆ పెద్దచూపిన సారధ్యము నందలి నైపుణ్యము, ఆ పెద్ద యిచ్చిన సందేశము నందలి వైభవము స్మరించుకొనుచూ, యిప్పటి మనకర్తవ్యమును గ్రహించి దానిని నిర్వహించుటకై సంసిద్ధులమగుటకే ఈ గురుపూజలు.

మనలో రావలసిన కదలిక రావడం కోసమే రాముడుగానో కృష్ణుడుగానో ఆ పెద్ద నడిపిన కథలన్నీ మనం పెద్ద గొంతుతో చెప్పుకొనేవి. మనలో కలగవలసిన స్ఫూర్తి కలగడానికే అతడు దాల్చిన మూర్తులను మనం మరల మరల స్మరించుకొనేది. మళ్ళీ ఇప్పుడూ స్మరించుకొందాం.

కదలి రండి! మాస్టరుగారి పిలుపును అందుకొనండి!



## సాగిపోవడమే మనం చేయవలసిన పని

ఎవరికి వారు తాము నమ్మింది ఎదుటివారిపై రుద్దుదామని చూసినపుడు తప్పక ఘర్షణ వస్తుంది. ఎవరి నమ్మకాలు వారికి ఉంటాయని తోటివారి నమ్మకాలను గౌరవించడం మానవ ధర్మమని గ్రహించినపుడు శాంతియుత సహజీవనం సాధ్యమవుతుంది. మనం ఎవరి నమ్మకాలనీ చెదరగొట్టకూడదు. చెదరగొట్టవలసిన పనిలేదు కూడా. అలా నమ్మకాలను చెదరగొట్టడానికి ప్రయత్నించడం నిజానికి జీవహింస అవుతుంది. ఎదుటివారితో, మీరేది నమ్ముతున్నారో దానిని మరింతగట్టిగా చిత్తశుద్ధితో చేయండి అని మనం చెప్పగలగాలి. మానవుల సంస్కారాల్లో వైవిధ్యాన్ని బట్టి, జీవపరిణామంలోని స్థాయీ భేదాలను బట్టి నమ్మకాలు యేర్పడడం, సిద్ధాంతాలు నచ్చడం జరుగుతుంది. మనం కోరవలసింది ఒక్కటే. ఏ సిద్ధాంతం నచ్చిన వాడైనా ఆ సిద్ధాంతాన్ని చిత్తశుద్ధితో విశ్వసించి ముందుకు సాగాలనే. ఎట్టి పరిస్థితులలోను ప్రయాణం మాత్రం ఆగకూడదు. ప్రయాణం ఆగకుండా సాగినపుడు మనిషికి కావలసిన సత్యదర్శనం తప్పక లభిస్తుంది. ఇపుడు ఒకటి జరుగుతోంది. సిద్ధాంతం నచ్చినవాడు ఆ నచ్చినదానిని అందుకుని ముందుకు సాగకుండా అక్కడే ఆగి ఆ సిద్ధాంతాన్ని గురించి మరింతమందికి వివరించాలని మరింతమందిని నమ్మించాలని తాపత్రయపడుతున్నాడు ఇది తప్పు. దీనివల్ల తాత్కాలికమైన కల్లోలం తప్ప ఒరిగేది ఏమీ ఉండదు. నచ్చిన సిద్ధాంతం వెంట ముందుకు సాగని వారిని ఎవరూ అనుసరించరు. ఆగి

పోయిన బస్సును ఎక్కడానికి ఎవరు సిద్ధపడతారు? ఆ బస్సు డ్రైవరు మనకు ఆత్మీయుడే అయినా ఆ బస్సులో సీట్లు ఎంత సౌకర్యంగా ఉన్నా ఆ బస్సును ఎక్కడానికి సాహసించం. కదలి సాగిపోతున్న డొక్కు బస్సే అయినా మనం అందులో ఎక్కడానికి వెనుదీయం. సిద్ధాంతాలను వల్లించేవారు ఆ తత్వాన్ని గమనించాలి. మన ప్రయాణం ఆగినపుడు జనం మన మాటకు స్పందించరు. స్పందించడం లేదు కాబట్టి జనం మూర్ఖులు అని నిందించకూడదు. మన ప్రయాణం ఆగిపోయిందని అందుకే వారు స్పందించడం లేదని గ్రహించగలగాలి. ఏ సిద్ధాంతంతోనైనా ముందుకు నడిచేవాడిని ఎందరో కొందరు అనుసరిస్తూనే ఉంటారు ఇది సత్యం. ఎంత గొప్ప సిద్ధాంతమైనా అది ఎందరికో పనికి వచ్చేది అయినా దానిని వివరిస్తున్న మన ప్రయాణం ఆగినపుడు జనం మనను సమీపించే ప్రయత్నం చేయరు. ఆ సిద్ధాంతాన కదులుతున్న వాడెవడో చూసి వాడి వెంట నడుస్తారు. ఇది నిజం. కనుక మీరు నమ్మిన సిద్ధాంతం ఏదైనా సరే అది అసంపూర్ణమైనదైనా సరే మీ ప్రయాణం ఆగనపుడు మీకు తప్పక పరిపూర్ణత లభిస్తుంది. తరువాతి సోపానం మీకుతప్పక ఎదురవుతుంది. ఏది గొప్పదని చర్చించడాలవల్ల మా సిద్ధాంతమే గొప్పదని గొంతులు చించుకోవడాలవల్ల, ఎప్పటికైనా మా సిద్ధాంత ప్రకారమే ఈ ప్రపంచానికి మోక్షం లభిస్తుందని బల్లలు బద్ధలు గొట్టడాలవల్ల మనం సాధించగలిగేది ఏమీలేదు. మన మనస్సుకు నచ్చిన సిద్ధాంతం వెంట చకచకా సాగిపోవడమే మనం చేయవలసిన పని. అలా సాగిపోయిన వాడొక్కడే కార్యసాధకుడు కాగలుగుతాడు.



## ఆలోచించండి ! మనసును మళ్ళించండి !

ఈ నవీన యుగంలో మనిషి జీవితం వ్యాపారసరళిగా నడిచి పోతున్నది. వర్ణధర్మాలూ, ఉద్యోగ వ్యాపారాలూ అన్నీ వ్యాపార సరళిలోనే నడుస్తున్నాయి. ఇంకా చెప్పాలి అంటే కేవలం డబ్బుదృష్టితో నడుస్తున్నాయి. ఏం చేసినా ఏం చెందిన అంతా డబ్బుకోసమే అన్నట్టుగా సాగుతున్నది ఈనాటి మన సామాజిక జీవనం.

ఒకప్పుడు ఊరిలో కనిపించిన వారినెల్ల పలకరించి వారి యోగ క్షేమాలను తనవిగా భావించి అడిగి తెలుసుకొంటూ వచ్చిన మనిషి ఈ రోజున కావల్సినవారితో గూడ తనకు కావల్సినదేమైనా ఉన్నప్పుడు మాత్రమే మాట్లాడుతూ సరిపెట్టు కొంటున్నాడు. అదేమిటి అంటే ఫలితం లేకుండా మాట్లాడి ప్రయోజనం ఏమిటి ? అంటున్నాడు. ఆ రోజుల్లో ఖాళీగా ఉండేవారు కాబట్టి అదే పనిగా మాట్లాడుకొనేవారు. ఇప్పుడు మనకెక్కడ ఖాళీ అంతా బిజీ అంటున్నాడు. బిజీ మాట ఎలా ఉన్నా జీవితాన్నే ఒక బిజినెస్‌గా మర్చుకొంటున్నాడు. ఒకప్పుడు వ్యాపారాన్ని కూడా ధర్మబద్ధంగా ఆచరించి దానిపైన మిగిలిన డబ్బు లతో ప్రజోపయోగ కార్యాలను నిర్వహిస్తూ తృప్తిపడిన జాతి మనది. ఇప్పుడు ప్రజావయోగ కార్యాలను కూడా మోసంతో నిండిన ఒక వ్యాపారంగా రూపుదిద్దగలుగుతున్న సామర్ధ్యం మనది.

ఈ వ్యాపార సరళిలో పడిన మనకు తల్లిదండ్రులు, అన్నదమ్ములు, ఆడబిడ్డలు, బంధుమిత్రులు అందరూ వ్యాపార పద్ధతిలోనే గనబడుతున్నారు. నా తల్లిదండ్రులు నాకేమియిచ్చారు కనుక నేను వారిని గురించి ఆలోచించడానికి? ఆవిడ తీసుకువచ్చిన కట్నం ఎంత కనక ఇంతకన్నా గౌరవం జరగడానికి? ఎందుకైనా మంచిది మీ పేరిట ఇన్స్యూరెన్స్ చేయండి. ఎప్పటికి ఏమో ఎవరు చెప్పగలరు? మనమింత చేస్తున్నాం ఇంత చూస్తున్నాం ఈ పిల్లలు పెరిగి పెద్దైన మనను ఎంత వరకు చూస్తారో? ఈ బంధు మిత్రులకు మన మింత చేస్తున్నా వాళ్ళ వల్ల మనకు ఒరగుతున్నదేమిటి? ఇలాంటి వాక్య విన్యాసాలతో ఈనాడు మన నిత్యజీవితం సాగుతున్నది అంటే మనం ఏ స్థితిలో ఉన్నామో ఒక్కసారి ఆలోచించు.

మనిషికి తోటిమనిషి కన్నా డబ్బు ముఖ్యమైనదిగా కనబడుతోంది. కనుక డబ్బును బట్టి తోటిమనిషితో సంబంధాలు పెట్టుకుంటున్నాడు అతను. ఒకప్పుడు ధనం కన్నా గుణం మిన్న అని ప్రవర్తనకు విలువనిచ్చి హారతులు పట్టినజాతి మనది. ఈ రోజున ప్రవర్తనను నిలబెట్టుకోడానికి ప్రయత్నిస్తున్నవాడిని పిచ్చివాడని, ఈ లోకంలో బ్రతకడానికి పనికిరాని వాడని చిన్నచూపు చూస్తున్నాం, హేళన చేస్తున్నాం. ఏదో ఒక విధంగా క్రిందపడో మీదపడో నాలుగు డబ్బులు సంపాదించినవారికి వేదికలపైన ఆసనాలు వేస్తున్నాం. ఆహ్వానించి వారిపై కీర్తనలు పాడుతున్నాం. ఇదంతా చూస్తుంటే ఏం తెలుస్తోంది? ఒకప్పుడు ధర్మం గమ్యంగా నడచిన మన జాతి నేడు ధనాన్నే గమ్యంగా భావించి దానివెంటపడుతోంది. మనిషి ధర్మ

స్థానంలో ధనాన్ని కూర్చోబెట్టినపుడు ఇక అతడు నైతికంగా పాతాళానికి పడిపోతాడు. మానవత్వపు విలువలకు పూర్తిగా వీడ్కోలు చెపుతాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ధర్మాన్ని విడిచి ధనాన్ని ఆశ్రయించిన మానవుడు ఇక దానవుడైపోతాడు. అలాంటి జీవితంలో రాగద్వేషాలూ, ఈర్ష్యాసూయలూ, కక్షలూ, కార్పణ్యాలూ, కుట్రలూ, కుతంత్రాలు ఇవే చోటు చేసుకొంటాయి. ఇక ఆ జీవితానికి మిగిలేది ఏమిటి? అసంతృప్తి తప్ప. అప్పుడతను ఏమంటున్నాడు? తన ప్రవర్తన వల్లనే తనకు అసంతృప్తి సిద్ధించిందని గమనించక తన తృప్తిని ఎవరో పోగొడుతున్నారని, తన సుఖాన్ని ఇంకెవరో హరిస్తున్నారని విరుచుకు పడుతున్నాడు. ఆ విరుచుకు పడడంలో అతను మరింత రాక్షసుడవుతున్నాడు.

ఇ. కె. మాస్టరుగారు చెప్పినట్టు "మనిషి డబ్బు వెంటపడకూడదు. డబ్బే మనిషి వెంటపడాలి." అదెలా సాధ్యం? ఒక్కలా మాత్రమే సాధ్యం. మనిషి ధర్మం వెంట నడవాలి. అప్పుడు మనిషివెంట డబ్బు నడిచివస్తుంది. ఈ సూక్ష్మాన్ని మనిషి గమనించాలి. మనం ధర్మం వెంట నడిచినపుడు మనవెంట నడిచివస్తున్న ధనం మన శ్రేయస్సును కోరి మనకు సహకరించే మంచి మిత్రుని వంటిది అవుతుంది. ధర్మాన్ని విడిచి ధనం వెంట మనం పడినపుడు ఆ ధనం కక్ష తీర్చుకోవడానికి మనపై కత్తి గట్టిన ప్రబల శత్రువులా నిలుస్తుంది. మనం ధర్మంవెంట నడిచినపుడు మన వెంట నడిచివస్తున్న ధనం మనను వృద్ధిలోనికి తీసుకు వెళుతుంది. ధర్మాన్ని విడిచి మనం ధనం వెంట పరుగెత్తినపుడు ఆ ధనం మనకు బుద్ధి చెప్పి తాను తప్పుకుంటుంది. కొందరు తెలియక

ఊరికే ధనాన్ని తిట్టుకుంటూ కూర్చుంటారు. అది వారి చేతకాని తనాన్ని తెలియజేస్తుంది. ధనం ఉండాలి. కాని ఆధనంతో మనం సరిగ్గా ఉండాలి. మనం ధర్మాన్ని ఆశ్రయించినపుడే ధనంతో సరిగ్గా ఉండడం మనకు చేతనవుతుంది. ఈ సత్యాన్ని మళ్ళీ ఒకసారి మానవుడు గమనించాలి. ధనం వెంటపడుతున్న తన మనస్సును తిరిగి ధర్మం వైపుకు మళ్ళించగలగాలి. ఇప్పుడు మనం అనుభవిస్తున్న సకల సమస్యలకూ పరిష్కారమార్గం అదొక్కటే ఆలోచించండి !

  

## జాతి నిర్మాణానికై దీక్షబూని కదలిరండి

ఈ నవీన యుగములో ఆధ్యాత్మికత పేరిట మనకు కనబడు తున్నదేమిటి? సాధన పేరిట విశ్రాంతిని పొందటానికి ప్రయత్నిస్తున్న వయస్సులు మళ్ళిన వృద్ధులకు ఆశ్రయాన్ని కల్పించండానికి కృషి చేస్తున్న కొన్ని మందిరాలు, ఆశ్రమాలు- చిత్తశాంతిని పొందడానికీ, జీవితంలో కొంతైనా వైవిధ్యాన్ని రుచి చూడడానికి యథాశక్తి నిర్వ హించుకుంటున్న సమావేశాలు, సప్తాహాలు- పాప పరిహారార్థమో, పుణ్య సముపార్జనార్థమో జరుపుకొంటున్న, జరిపించుకొంటున్న సహస్రనామ పూజలు, లక్ష కుంకుమార్చనలు, రుద్రాభిషేకాలు, ఆకుపూజలు మొదలైన పూజాదికాలు, క్రతుకాండలు- ఇంకా వ్రతాలు ఉపవాసాదు- బాధలకై మొక్కులు, యాత్రలకై దీక్షలు మొదలైన ఎన్నోరకాలైన

ఎన్నోరకాల ఉపాసనలు- పశ్చాత్తాప ప్రార్థనలు- మా దేవుడే దేవుడన్న అహంభావ విన్యాసాలు, మరో సంప్రదాయాన్ని సహించలేని శుష్క-వాదాలు- మన గురుమూర్తిని గాక మరొక గురుమూర్తిని గౌరవించలేని ఈర్ష్యాద్వేషాలు- మతాల పేరిట ఘర్షణలు, దోపిడీలు,విధ్వంసాలు, హత్యాకాండలు, దారుణ మారణ హోమాలు- ఎక్కడో అక్కడక్కడా మాత్రం నిజమైన ఆధ్యాత్మికత పునరుజ్జీవనమౌతున్న కొన్ని శుభ సూచనలు. కాదు చీకటిలో కాంతిరేఖలు- ఇది నేటి పరిస్థితి, మన దేశ పరిస్థితి.

పూర్వకాలంలో ఆధ్యాత్మికతకు ప్రతినిధులుగా పని చేసిన మన ఋషులు ఏమి చేశారు? మామూలుగా చూస్తే సమాజానికి దూరంగా అరణ్యాలలో ఎక్కడో ఆశ్రమాలను నిర్మించుకొని, సాధనలు చేసుకుంటూ, యజ్ఞయాగాది క్రతువులను నిర్వహించుకుంటూ, సత్కథా కాలక్షేపాలను జరుపుకుంటూ కాలాన్ని వెళ్ళబుచ్చారు అనిపిస్తుంది. కాని వారేం చేశారో తెలుసునా ? వారెందుకు సమాజానికి దూరంగా ప్రత్యేకమైన వాతావరణాలను సృష్టించుకున్నారో తెలుసునా ? ఈ సమాజానికి సమర్థము, ధర్మబద్ధము అయిన రూపును దిద్దడానికే ఆ ఋషులు తమ ఆశ్రమాలను జాతి నిర్మాణ కేంద్రాలుగా నిర్వహించారని కొంచెం నిలబడి చూస్తే, మనకు తెలుస్తుంది. ఎనిమిది, పదకొండు, పన్నెండు సంవత్సరాల వయస్సుల్లో బాలబాలికలను తీసుకుని వెళ్ళి, సమాజం ఆ ఋషులకు అప్పగించేది. ఆ ఋషులు ఆ బిడ్డలను దగ్గరకు తీసేవారు. ఇలా తల్లిదండ్రులు అప్పగించడం, గురుమూర్తులు చేరదీయడం జరిగే ఈ శుభ సందర్భాన్నే మన పెద్దలు " ఉపనయనము "

అని పిలిచారు. ఇక ఇక్కడ నుంచి బాలబాలికల జీవలక్షణాలకు పదును పెట్టబడేది. తగిన శిక్షణ ఈయబడేది.

బాలబాలికలు తమ శరీర కోశాలను, ఈ సృష్టి నిర్మాణ వ్యూహాలను ఏకకాలంలో పరిచయం చేసుకుంటూ, ఇటు శరీరాన్ని దాని ప్రయోజనాన్నీ, అటు సృష్టినీ దాని పరమార్థాన్నీ ఆకళింపు చేసుకుంటూ, ఈ సృష్టిలో ఈ దేశకాలాలలో ఈ శరీరం తమకు ఎందుకు ఈయబడిందో అవగతం చేసికొని, సమాజ శ్రేయస్సును సాధించడంలో తమ వంతు పాత్రను గమనించుకొనీ, ఆ పాత్రను నిర్వహించేటందుకు కావలసిన శిక్షణను, శక్తియుక్తులను, విజ్ఞాన వివేకాలను సంతరించుకొనీ, సమర్థులై సత్పౌరులుగా సమాజానికి సేవజేయగల కార్యకర్తలుగా, వయస్సు వచ్చేటప్పటికి తయారై, గురువుల ఆశీర్వాదాన్ని పొంది సమాజంలోకి మళ్ళీ ప్రవేశించేవారు. అలా ప్రవేశిస్తున్న వారిని జూచి సమాజం పరవశిస్తూ స్వాగతం పలికేది. ఎందువలన? వారు సమాజంపై ఆధారపడటానికి రావటం లేదు. సమాజానికి ఆధారం కావడానికి వస్తున్నారు. జరుగవలసిన కృషిలో పాలు పంచుకో గలిగిన నేర్పరులై ప్రవేశిస్తున్నారు. ఇంతకన్నా కావలసినదేమున్నది? ఇంతకన్నా జరుగవలసినదేమున్నది?

జాతినిర్మాణ కేంద్రాలుగా మానవశక్తికి కావలసిన రూపుదిద్దుతూ వచ్చిన మన పెద్దల అడుగుజాడల నుండి మన అడుగు జారిందో లేదో, అప్పుడే మన పని అయిపోయింది. యుగాల తరబడి నడచివస్తున్న మన జీవన స్రవంతిలో నిరుద్యోగమన్నది ఎరుగున్నామా? ఇది మన

స్వయంకృతాపరాధం కాదా? ఆధ్యాత్మికతకు ప్రాతినిధ్యం వహిస్తున్న పెద్దల జాతి నిర్మాణ బాధ్యతను వదలి, ఏవేవో కార్యక్రమాల హడావుడిలో మునిగితేలడం న్యాయమేనా? పెద్దల అధీనంలో విద్యను ఉంచి సజీవంగా ఆ విభాగాన్ని నడిపించడం మాని, తానా బాధ్యతను కోరి తీసుకుని, బలవంతపు విద్య పేరిట కుఱ్ఱవాళ్ళను బలాత్కరించి, విద్యార్థులుగా సేకరించి ఏళ్ళతరబడి విద్యాలయాలలో మగ్గబెట్టి, నిర్వీర్యులైన నిరుద్యోగులుగా వారిని రూపొందించి బయటకు విడిచి పెడుతున్నది గదా ప్రభుత్వం! ఇది ధర్మమేనా! పరాధికారము పైన వేసుకున్నట్లు కాలేదా? ఆ ఫలితం రాలేదా?

బ్రాహ్మణ, క్షత్రియ ధర్మాలు గతులు తప్పినవేళ విద్య తన పవిత్రతనూ, ప్రయోజనాన్నీ కోల్పోయి, నామమాత్రంగా కేవలము అక్షరాస్యతగా మిగిలిపోయింది. అంటే, ఎన్నేళ్ళు చదివినా వచ్చేవి ఆయా భాషలకు సంబంధించిన నాలుగు అక్షరం ముక్కలు తప్ప, ఇంకేమీ కనబడడంలేదు. జాతినిర్మాణం ఆగిపోయింది. యువకుల జీవితాలు వృథా అవుతున్నాయి. నవతరం నలుగురూ నవ్వేతరంగా రూపు దిద్దుకుంటున్నది. ఇక దేశానికి జాతికి భవిష్యత్తు ఎక్కడ ఉన్నది? ఈ నిజస్థితిని గమనించకుండా ఆధ్యాత్మికత పూజలకు, పునస్కారాలకు, పురాణ కాలక్షేపాలకు మాత్రమే అంకితం చేయవచ్చునా? ఈ నిజస్థితిని గమనించకుండా ప్రభుత్వం కేవలం సంక్షేమ పథకాలకు, ప్రజాకర్షక వ్యూహాలకు తమ శక్తి యుక్తులను ధారపోయవచ్చునా? ఆలోచించండి!

ఇప్పటికైనా ఆధ్యాత్మిక వేత్తలు జాతినిర్మాణ మనేది ప్రధాన కార్యక్రమంగా స్వీకరించి మానవశక్తిని వికసింపజేసి దానికి పదును

పెట్టి తగిన శిక్షణనిచ్చి, లోకశ్రేయస్సుకు సమర్పణ చేసేటందుకు పెద్ద యెత్తున నడుం కట్టవలసియున్నది. పూజలు, వ్రతాలు, యజ్ఞాలు, యాగాలు అక్కరలేదని నేననడంలేదు. అవన్నీ ఈ అక్కరకే! మానవ శక్తి తీర్చిదిద్దబడి లోకశ్రేయస్సుకు అనుగుణంగా విజృంభింప జేయడ మనే ఈ అక్కరకే! అని అంటున్నాను నేను. ఈ కర్తవ్యానికి అంకిత మైననాడు అన్నీ అవసరమే, అన్నీ అర్థవంతమే అని సవినయంగా మనవి చేస్తున్నాను. ఈ కృషి పెద్ద ఎత్తున ప్రారంభమైన వేళ ప్రభుత్వమే దానికదిగా దిగివస్తుంది. దిగివచ్చి, వలసిన స్థాయికి ఎదిగివచ్చి, తన వంతు పాత్రను యథావిధిగా నిర్వర్తించి తీరుతుంది. అని ఆత్మ విశ్వాసంతో ప్రకటిస్తున్నాను. ప్రభుత్వాన్ని కోరకండి, కొఱర్పి కోరి నట్లు ! ఇప్పుడు దాని దగ్గర ఏముంది కనుక! ప్రభుత్వాన్ని సతాయించ కండి, సతాయించినా అదేం చేయగలదు కనుక ! మరేం చేయాలి? ప్రభుత్వానికే దారి చూపగలగాలి. ప్రభుత్వానికే వెలుగు చూపగలగాలి. ఓ ఆధ్యాత్మిక వేత్తలారా! జాతి నిర్మాణానికి నడుము కట్టిన మీ దీక్ష ఈ ప్రభుత్వానికీ, ఈ జాతికీ దారి చూపగలదు. వెలుగు నివ్వగలదు. కనుక జాతి నిర్మాణానికై దీక్ష బూని కదలిరండి !



## వేదపురుషుడు ఆహ్వానిస్తున్నాడు కదలిరండి!

మీరు ఈ వేదభాగాలను శ్రద్ధగా అధ్యయనం చేయండి. మీ దినచర్యలో ఈ వేదాధ్యయనాన్ని ఒక భాగం చేసుకోండి. మీలో తిరిగి వేదం నేర్పగలిగినవారు, మీరెక్కడ వుంటే అక్కడ దానిపైన ఇచ్ఛ కలిగినవారికి దానిని నేర్పడం ఒక వ్రతంగా స్వీకరించండి. మీరు నిజంగా జాతి పునర్నిర్మాణాన్ని కోరుతున్నారా? అయితే ఈవేదాధ్యయనాన్ని మీరు విడనాడకండి. ఎందువల్లనంటే వేదం మన జాతి సంస్కృతికి మూలం. నిజం చెప్పాలంటే మానవజాతి సంస్కృతికే అది మూలం. అది పునాది. ఆపునాదిపైనే మనం ఎన్ని అంతస్థులయినా వేయవలసినది! వేదాన్ని నేర్వకుండా, వేదానికి ప్రాధాన్యం ఈయకుండా మీరు జాతిలో మార్పును కోరే ఎన్ని ఉద్యమాలు నిర్వహించినా అవి పునాదులులేని మేడలు అవుతాయి.

కొందరు స్త్రీలు వేదం చదవకూడదని అడ్డు పెడుతున్నారు. సంప్రదాయం తెలిసినవారు ఆ పని చేయరు. తామెరిగినదే సంప్రదాయం అనుకున్నవారి నోటినుండి ఇలాంటి ఆంక్షలు వెలువడుతూ ఉంటాయి. పూర్వకాలంలో గురుకులాల్లో బాలబాలికలు కలసిమెలసి పవిత్రమైన క్రమశిక్షణతో వేదశాస్త్రాలను నేర్చుకొనేవారు. ఇంకా కొంచెం వెనక్కు

వెళితే బాలురతో పాటు బాలికలకు కూడా ఉపనయనాన్ని నిర్వహించే అలవాటు మనకు ఉన్నదని తెలుస్తుంది. స్త్రీ–పురుష విభాగమన్నది సంతానోత్పత్తి కొరకు ప్రకృతి ఏర్పరచిన ఒక సౌకర్యం. అది ఒక ఆవశ్యకమైన విభాగంగా మనం స్వీకరించాలి తప్ప, సద్వినియోగం చేసుకోవాలి తప్ప, మిగిలిన ఏ విషయంలోనూ ఎన్నడూ స్త్రీ-పురుషుల మధ్య తరతమ భేదాలను పాటించకూడదు. అలా పాటించడం నేరం అవుతుంది. ప్రకృతి చేసిన విభాగాన్ని, ఆ విభాగము ద్వారా ఆశించిన ప్రయోజనాన్ని మనం అవమానించినట్లవుతుంది. విభాగాలను వివేకంతో సద్వినియోగం చేసుకోవాలి గాని విభేదాలను సృష్టించి చేతులారా పతనానికి దారి వేసుకోకూడదు. వేద మంత్రాలను దర్శించిన వారిలో స్త్రీ మూర్తులు ఉన్నారు. కనుక వేదాధ్యయనం స్త్రీ - పురుషులిరువురు గొంతు కలిపి చేయవలసిన ఒక దివ్యగానం అని మనం మరువకూడదు.

కొందరు ఉపనయనం కాకుండా వేదం నేర్చుకోవడమేమిటని కుర్రవాళ్ళను చూసి గద్దిస్తున్నారు. నిజమే ! మరి కావల్సిన వయసులో ఆ కుర్రవాళ్ళకి ఉపనయనం చేయాలని ఈ పెద్దలు మరచిపోయారు. తమ బాధ్యతను మరచిన వారికి ఇక ఆ విషయమై తప్పుపట్టే అధికారం ఎక్కడనుండి వస్తుంది ? బ్రాహ్మణధర్మం అనుష్ఠించవలసిన వారికి 8 వ ఏట క్షత్రియ ధర్మం అనుష్ఠించ వలసిన వారికి 11 వ ఏట వైశ్యధర్మం అనుష్ఠించ వలసినవారికి 12వ ఏట ఉపనయనం జరిపించి వారిని గురువులకు అప్పగించాలని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. మరి ఆ ఘోష ఈ పెద్దలకు వినపడలేదా ?

ఆ ధర్మశాస్త్రాల ఘోషను వినిపించుకోకుండా తమకు తాముగానైనా మేల్కొని వెంటపడుతున్న యువకులను అవి తప్పని పెద్దలు సతాయించవచ్చునా ? అన్నప్రాశన మనకు చేయడానికి తీరిక దొరకనంత మాత్రాన నెలలు మించుతున్న పిల్లవాడు పెద్దవాళ్ళ అన్నం కంచాలతో కలబడకుండా ఉంటాడా ? అప్పుడు ఆపిల్లవాణ్ణి మనం తప్పు పట్టవచ్చునా ? ఈ విషయాన్ని పెద్దలయినవారు శ్రద్ధతో ఆలోచించాలి. ముందు తమను తాము దిద్దుకొనే ప్రయత్నం చేయాలి. తమకర్తవ్యాన్ని తామే గుర్తిస్తున్న యువకులను ఆపబూనడం - ఇదిఘోరం ! ఇది దారుణం. ఇది సాధ్యపడేదికాదు. మీరాపలేరు వారిని. ఆ యువకులను అప్పగించడానికి తీరికలేదని గ్రహించి ఆవేదపురుషుడే చేతులుచాచి వారిని ఆహ్వానిస్తున్నాడు. వేదపురుషుని పరిష్వంగంలోని పారవశ్యాన్ని అనుభవించడానికై యువత పరుగుతీస్తున్నది. ఇక మోకాలడ్డి ఏం లాభం ! మీ కాలుకే ప్రమాదం సత్యాన్ని గ్రహించండి. తిరిగి సంప్రదాయాన్ని పెద్దలమార్గంలో అనుష్ఠించే ప్రయత్నంచేయండి.

కొందరు ఎవరికిపడితే వారికి వేదం నేర్పవచ్చునా ? మీరు బ్రాహ్మణులు కానివారికి కూడా నేర్పుతున్నారట కదా ! అని అడుగుతూ ఉంటారు. "సంప్రదాయాన్ని భ్రష్టు పట్టిస్తున్నారు" అన్నట్టు చూస్తారు. సంప్రదాయం ఏం చెబుతోంది ? సంప్రదాయం మానవులను నాలుగు విధాలుగా గుర్తించుతుంది. వారికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని నామకరణం చేసింది. బ్రాహ్మణ ధర్మాన్ని అనుష్ఠించేవారు వేదాన్ని తాము అధ్యయనం చేయాలి. మిగిలినవారి చేత చేయించాలి అని చెప్పింది. క్షత్రియ, వైశ్య ధర్మాలను అనుష్ఠించేవారు వేదాన్ని

శ్రద్ధగా అధ్యయనం చేస్తే చాలు అని చెప్పింది. ఇక మిగిలినది శూద్రులు. వీరు మరొకరి ఆజ్ఞకు లోబడి పనిచేసేవారు గనుక తాముగా ఏ నిర్ణయాన్ని మానసికంగా ఆలోచించి వీరు తీసుకోవాల్సిన అవసరంలేదు గనుక వారికి వేదాధ్యయనం యొక్క ఆవశ్యకతలేదు అని చెప్పింది. మరొకరి ఆజ్ఞకు కట్టుబడి తమ శారీరక శ్రమను శ్రద్ధతో లోకశ్రేయస్సుకు సమర్పణ చేస్తున్న శూద్రులు పుట్టుకతోనే ముక్తులవుతున్నారని కీర్తించింది. దీనిని బట్టి ఏం తెలుస్తుంది ! మనస్సు పనిచేస్తున్నవారు, మనస్సుతో పనిచేస్తున్నవారు తప్పక వేదాధ్యయనం చేసి తీరాలని తెలుస్తుంది. మనస్సుతో పెద్దగా పనిచేయక శారీరక శ్రమకు మాత్రమే జీవితాన్ని అంకితం చేసినవారికి వేదాధ్యయనంతో పనిలేదనికూడా తెలుస్తుంది. కనుక మనస్సు పనిచేస్తున్నవారు, మనస్సుతో పనిచేస్తున్నవారు తప్పక వేదాధ్యయనం చేసితీరాలి. వేదార్థాన్ని దర్శించి తీరాలి. లేకపోతే వాళ్ళు ధర్మభ్రష్టులు అయిపోతారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యధర్మాలను అనుష్ఠించేవారు వేదసంస్కారాన్ని కలిగి ఉన్నంతవరకు శూద్ర ధర్మం అనుష్ఠించే సోదరులతో చక్కగా శ్రుతి కలిపి సమాజ శ్రేయస్సునుసాధించగల్గుతారు వేద సంస్కారాన్ని కోల్పోయినపుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే విభాగాలుపోయి విభేదాలు మిగులుతాయి. అప్పుడు ఎవరు ఎక్కువ ? ఎవరు తక్కువ ? ఎవరు చదువవచ్చు ? ఎవరు చదువకూడదు ? ఇలాంటి దుష్టమైన ఆలోచనలు పుడతాయి. కనుక వేదపురుషుడి వెలుగులో మననొకసారి మనం సరిచూసుకోవలసి ఉంది. తన పరిష్వంగంలోకి ఎవర్ని స్వీకరించాలో వేదపురుషుడికన్నా మనకే ఎక్కువ

తెలుసుకోవడం - అది అహంకారపడడం కాదా ? అహంకారపడడం అనగా ఇక పడడమే సుమా ! కనుక మనం పడడం మానేసి పడవలసిన దారిన పడదాంరండి! జరుగవలసిన ప్రయాణానికి చేతులు కలపండి! మనస్సులు మొరిగేచోటు నుండి మనస్సులో కరిగే చోటుకు మనం ప్రయాణం చేద్దాం ! మనస్సులు కల్పిస్తున్న పరిమితులనుండి ఈశ్వర సామ్రాజ్య వైభవంలోనికి అడుగుపెడదాం! అదిగో - తరతమ భేదాలను వీడి తన చెంతకు చేరుకొమ్మని వేదపురుషుడు మనలను ఆహ్వానిస్తున్నాడు. మీకూ వినబడుతోంది కదా ఆ పిలుపు ! మీకూ కనబడుతోంది కదా ఆ వెలుగు ! ఇక కదలిరండి !

  

## మన ఉద్యమం విజయవంత మవుతుంది

సేవాభావం లేనివారు, వైద్య స్వభావం ఒంటపట్టనివారు పెద్ద ఎత్తున ప్రవేశించడంతో వైద్యరంగంలో వ్యాపార సరళి పెరిగిపోతోంది. రోగులకోసంకాక, రోగుల మీద బ్రతికే డాక్టర్ల సంఖ్య పెరగడంతో సామాన్య మానవుని పరిస్థితి ఇరకాటంలో పడిపోయింది. నర్సింగ్ హోమ్‌లు లాడ్జిల్లాగ, స్టార్‌హోటళ్ళు లాగ మారి ప్రజల జేబులను ఖాళీ చేస్తున్నాయి. రోగుల వ్యాధి తీవ్రతను తాము సొమ్ముచేసుకోవడానికి 'గాను వైద్యులుగా ఉన్నవారు ఉపయోగించుకుంటున్నారు-

అంటే ఎంత దారుణం ! అంతేకాక వైద్యులనుండి రోగార్తులకు కావలసిన సానుభూతికూడ దొరకడంలేదు. దానితో అటు డబ్బూపోయి, ఇటు జబ్బుమిగిలి, కనీసం, రెండు ఓదార్పుముక్కలు కూడ కరువై, నిస్సహాయస్థితిలో మిగిలిపోతున్నాడు సామాన్య మానవుడు. ఇటువంటి పరిస్థితులలో కర్తవ్యం ఏమిటి ? వైద్యులను నిందించి వాళ్ళ వైద్యాలయాల ముందు ధర్నాలు జరిపి వారిలో దాని మార్పును తీసుకువచ్చే ప్రయత్నం చేసే కన్న, సూటిగా సామాన్య మానవునికే వైద్యవిజ్ఞానాన్ని కావలసిన మేరకు వెదజల్లడం మంచిది అని భావించడంతో ఈ హోమియో వైద్యశిక్షణ తరగతులకు రూపకల్పన జరిగింది. రూపకల్పన చేసిన వారు కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యగారు. ఇప్పుడు మనం ఆయన పెట్టిన ఒరవడిలోనే ఆయన ఉద్దేశించిన గమ్యం కోసమే తరగతులను నిర్వహించుకుంటున్నాం.

సామాన్యలోకంలో ఏవో చిన్నచిన్న వ్యాధులకు తోచీతోచని విధంగా ఈ హోమియోను వాడుకునే దురలవాటు బాగా ప్రబలిఉంది. హోమియో విధానమంటే ఏమిటో సరైన అవగాహన లేకుండా హోమియో మందులను వాడడంవల్ల జరిగే ఉపకారంకన్న అపకారమే ఎక్కువ. శాస్త్రీయమైన అవగాహన పొందినప్పుడు హోమియో విధానం చాలా తేలికైనదని, దుర్బలము దుష్టము అయిన మానవ మనస్తత్వాలనే అది సరిచేసి మనిషికి రెండవజన్మను ప్రసాదించగలదని తెలుస్తుంది. ఉపయోగించడం చేతనైనప్పుడు జాతి పునర్నిర్మాణానికై మనంచేస్తున్న ప్రయత్నంలో ఈ హోమియోవైద్యం ఒక వజ్రాయుధంలా సహకరిస్తుంది కుటుంబాలలో కల్లోలాలను రూపుమాపడంతో మొదలు పెట్టి యావత్ ప్రపంచశాంతిని సాధించడం వరకు ఈ హోమియో విధానాన్ని మనం వినియోగించుకోవచ్చు.

అసలు అస్వస్థత అంటే ఏమిటి ? అస్వస్థత నుండి స్వస్థత కు మనం ప్రయాణం చేయడం ఎలా ? స్వస్థత ను నిలబెట్టుకోవడానికై మనం పాటించవలసిన నియమావళి ఏమిటి ? మొదలైన అంశాలు మీకు చక్కగా వివరించబడతాయి. అస్వస్థతను గమనించడంలో గల శాస్త్రీయమైన పద్ధతి మీకు బోధించబడుతుంది. దానితో మీకు వ్యాధుల ఎడల భయాందోళనలు తొలగిపోతాయి. మీ పరిస్థితి ఏమిటో, మీలో ఏం జరుగుతుందో మీకు తెలుస్తుంది. దానితో మీరు నేటి వైద్యులు చేస్తున్న శతవిధాల పరీక్షల బారి నుండి రక్షింప బడతారు. అస్వస్థత ను గమనించిన పిదప నిర్వర్తించవలసిన ఔషధ ప్రయోగాన్ని గురించి కూడా మీకు తగుమాత్రం వివరించ బడుతుంది. దానితో మీరు మాటి మాటికి వైద్యుల చెంతకు పరుగెత్త వలసివస్తున్న అవసరం నుండి బయటపడతారు. ఒకవేళ మీకు అందని అనారోగ్య పరిస్థితి మీకు ఏర్పడి వైద్యులచెంతకు వెళ్ళవలసి వచ్చినా ఆ వైద్యులు చేస్తున్నది సరియైన వైద్యమో కాదో, మీ వ్యాధి యెడల ఆ వైద్యుని అవగాహన సక్రమమైన మార్గంలో నడుస్తున్నదో లేదో మీకు ఇట్టే తెలిసి పోతుంది ఇవి ఈ తరగతులకు హాజరు కావడం వల్ల కలిగే ప్రయోజనాలలో కొన్ని.

ప్రస్తుతకాలంలో ఏ అంశం సాధింపబడాలన్నా అది ప్రజలలో నుండే బయలుదేరాలి. ప్రజా ఉద్యమంగా రూపుధరించినపుడు మాత్రమే ఏ అంశమయినా నేడు సాధింపబడేది. కనుక ఈ వైద్య శిక్షణ తరగతులను నేటి సమాజానికి కావలసిన ఉద్యమంగా మనం చేపడుతున్నాం. ఇది జరగవలసిన పని కనుక తప్పక జరుగుతుంది. మన ప్రయత్నం ఫలిస్తుంది. మన ఉద్యమం విజయవంతమవుతుంది. మన జీవితాలు ధన్యమవుతాయి.

  

## నచ్చిన పనిని అందరూ చేస్తారు : చేయవలసిన పనిని చేయండి

నచ్చిన పనిని అందరూ బాగానే చేస్తారు. చేయవలసిన పనిని శ్రద్ధతో చేసేవారు నాకిపుడు కావాలి. నచ్చిన పని వచ్చినపుడు పులిలా విజృంభిస్తారు. చేయవలసిన పని ఎదురుగా ఉన్నప్పుడు మనది కాదులే అన్నట్టు జారుకుంటారేమి ? ఆ మాత్రం దానికి మనందరం ఇక్కడ చేరి ఇంత హడావుడి చేయడమెందుకు ? నచ్చిన పనిని లోకంలో సామాన్యుడని పిలవబడేవాడు కూడా మనకన్నా దీక్షతోనే నిర్వహిస్తూ ఉంటాడు. మరి మనం సాధకులమనుకుంటున్నాం. సామాన్యుడు తనకు నచ్చిన పనిని ఎంత దీక్షతో చేస్తున్నాడో చేయవలసిన ప్రతి పనిని అంత దీక్షతో చేసినపుడే మనం సాధకులనబడతాం. ఒక ఊళ్ళో ఒక తండ్రి ఉండేవాడు. అతనికి తన బిడ్డను చదివించు కోవాలని అమిత మైన కోరిక. అతనికి నచ్చిన పని. అది దానికోసం అహోరాత్రులు పరి తపించేవాడు బస్తీ వెళితే దాహం అయితే సోడా త్రాగకుండా, బజారు కుళాయివద్ద దోసిలి పట్టి ఆ నీరు త్రాగేవాడు. ఆ పదిపైసలు ఉంటే బిడ్డ చదువుకి పనికి వస్తుందని అతని ఆశ. ఆ పగటి పూట అన్నం తినకుండా రాత్రి ఇంటికి ఎలాగూ వెళతాను కదా ! ఏకంగా తింటాలే అనేవాడు. అ మూడు రూపాయలు మిగిలితే తన బిడ్డ చదువుకే మిగులు

తుందని అతని తపన. చూడండీ ! ఆ తండ్రి దీక్ష. మనకు నచ్చిన పనిని మనం కూడ అంత దీక్షగా చేస్తున్నామని చెప్పలేం కదూ ! భార్య వచ్చి, ఏమండీ ! కట్టుకునేందుకు చీరలు లేవు- పూర్తిగా చిరిగి పోయినాయి అంటే, ముందు అబ్బాయి చదువు కానీ, తరువాత చూద్దాం అనేవాడతను. ఆ ప్రక్క ప్రహరీగోడ చూడండీ ! పడిపోతోంది. గోడ్డూ గోడా లోపలికొచ్చేస్తున్నాయి. మొక్కా, మోడు నిలిచే ఆశ కనబడడం లేదు. అని పాపం ! ఆ ఇల్లాలు అంటే, కానీయండి బండి ఎలాగోలాగ నడిపించండి. ముందు అబ్బాయి చదువు కావాలి కదా ! అంటాడా గృహస్థుడు. నిజానికివన్నీ పనులు కావా ! వాటిని చేయవలసిన అవసరం అతనికి లేదా ? ఉన్నది. కాని అతడు తనకు ఎదురుగా వున్న పనులలో తనకు నచ్చినదాని వేపే చూడగలుగుతున్నాడు. ఆ చేయవలసిన పనులన్నిటిపైన ఒకే విధమైన దీక్షను చూపించలేక పోతున్నాడు. అందుకే అతన్ని సామాన్యుడు అన్నాం.

మరి మనం సాధకులం అనుకుంటున్న వాళ్లలో గూడ గుడులు, గోపురాలు నచ్చినవాడు ఆధ్యాత్మికత అంటే వాటిని కట్టడమే అంటున్నాడు. శిథిలమవుతున్న దేవాలయాలు ఎన్నో ఉండగా వాటిని పట్టించుకోకుండా నా మానాన నేను ఇంకో కొత్త గుడిని కడతాను అంటున్నాడు. మందులివ్వడం నచ్చినవాడు సేవ అంటే వైద్యసేవే సేవ అంటున్నాడు. మిగిలినవి అసలు సేవ కాదు పొమ్మంటున్నాడు. ఊరేగింపులు నడపడం నచ్చినవాడు ప్రజల్ని ఊరేగింపుల ద్వారానే చైతన్యవంతులను చేయగలం అంటున్నాడు. ఆ ఊరేగింపులు జర పడమే అభ్యుదయ కార్యక్రమం అంటున్నాడు. ఇలా ఎవరికి నచ్చిన ప్రకారం వారు తమకు నచ్చినదే గొప్పనుకుంటూ చేసుకుంటూ పోతున్నారు. దీనివలన మనకు నచ్చిన పనులు జరుగుతున్నాయి. కాని

జాతికి జరుగవలసిన పనులన్నీ జరుగడం లేదు. నచ్చింది జరుపుకోవడం అనే స్థితి నుండి జరుగవలసిన ప్రతిపనీ మనకు నచ్చే స్థాయికి మనం ఎదగాలి. ఆ స్థితికి ఎదగడానికే ఈ సంస్థలూ, ఈ శిక్షణలూ ఇవన్నీ.

దేశంలో ఎంతోమంది సమర్థులున్నారు. ఉద్దండులున్నారు. మహా మహులున్నారు. కానీ, వాళ్లలో ఎక్కువమంది తమకు నచ్చినట్లు చేయడానికే తమ శక్తియుక్తులన్నిటిని ఖర్చుపెడుతున్నారు. అలాకాక, ఈ రోజు, ఇప్పుడు ఈ దేశానికీ ఈ జాతికి ఏది అవసరమో చూసి, ఆ అవసరంలో తమ పాత్ర ఏమిటో గమనించుకొని కావలసిన పద్ధతి లో తమతమ శక్తియుక్తులన్నిటిని లోక శ్రేయస్సుకు సమర్పణ చేయగలిగిన వాళ్ళిప్పుడు కావాలి. అలా జరిగిన నాడు మనజాతి తిరిగి తల యెత్తి తిరుగుతూ ప్రపంచ జాతులకు శాంతి పథాన్ని నిర్దేశించ గలగడానికి ఎంతో కాలం పట్టదు.

సోదరులారా ! మిమ్మల్నొక్కటే కోరుతున్నాను. నచ్చిన పనులను కాక చేయవలసిన పనులకు అంకితం కండి ! చేయవలసిన పనులన్నిటిని ఒకే శ్రద్ధతో, ఒకే దీక్షతో చేయగలిగిన స్థితికి ఎదిగి రండి ! నచ్చినది చేసినప్పుడు అది సత్వకర్మ అవుతుంది. చేయవలసినది చేసినప్పుడు అది సృష్టికర్మ అవుతుంది. మీరు నాకీయవలసిన జన్మదిన కానుక ఇదే. చేయవలసిన పనులకై చేయి.చేయి కలుపుదాం. కదలిరండి ! కలసి నడుద్దాం !

  

# దేవుడు ముచ్చటపడే దేవాలయాలను నిర్మిద్దాం!

మనోవ్యాధికి మందులేదంటారు. కానీ హోమియో విధానం మనస్సులోనే వ్యాధికి మూలకారణం ఉంటుందని తెలియచెబుతోంది. మనస్సు నుండి ఆపై కోశాలలో వ్యాధి అనే వృక్షము యొక్క వేళ్ళు ఉండగా, ఆ వృక్షము యొక్క కొమ్మలూ రెమ్మలే మనస్సు నుండి యివతలి కోశాలలో మనకు కనిపిస్తున్నాయని, కనుక కనులు విప్పి చూడమని మానవుణ్ణి హెచ్చరిస్తోంది. వ్యాధి కోసం దేహంపైన మాత్రమే దేవులాడితే సరిపోదని, మనస్సును ఆపై కోశాలను సూటిగా చూడగలిగినప్పుడే వ్యాధి నివారణకు మార్గం దొరుకుతుందని ఘంటాపథంగా చెబుతోంది. వరుసగా ఈ తరగతుల్లో ఔషధాలను గూర్చి నేను వివరిస్తున్నప్పుడు ఆ ఔషధాలు వ్యక్తంచేస్తున్న మానసిక లక్షణాలలోని విలక్షణతను మీరు గమనిస్తూనే వస్తున్నారు కదా! సత్యాన్ని దర్శనం పొందుతున్న ఈ స్థితి నుండి చూచినపుడు దీర్ఘవ్యాధులే కాక మానసిక ఉన్మాదస్థితులు కూడ పద్ధతిగా హోమియో వైద్యాన్ని చేసినపుడు చాల సులువుగా దానిలోకి రాగలవనితెలుస్తుంది.

ఇప్పుడు ప్రసిద్ధి చెందిన మానసిక వైద్యాలయాల్లో ఉన్మాదులైన వ్యాధి గ్రస్తులను ఏంచేస్తున్నారో మనకు తెలుసు. రకరకాల మత్తు

బిళ్ళలను తినిపిస్తున్నారు. వివిధ పద్ధతుల్లో ఎలక్ట్రిక్ షాక్స్ ఇస్తున్నారు. దానితో ఆ రోగులు ఒక విధమైన స్తబ్ధతను చెంది జడప్రాయువులవుతున్నారు. మనస్సుకున్న శక్తి తగ్గి మహా నడుపుకుంటే దినచర్యను మాత్రం నడుపుకోగలుగుతున్నారు ఆ ఉన్మాదులు. ఈ స్థితి కూడ ఎన్నాళ్ళు నిలబడుతుందో చెప్పలేము. ఏ క్షణాన్నైనా మళ్ళీ వ్యాధి విజృంభించవచ్చు. అప్పుడు మళ్ళీ మత్తుమందులు, ఎలక్ట్రిక్ షాకులు- కథ మామూలే. ఈవైద్యాన్ని పశువైద్యమని కూడా అనలేము. రాక్షస వైద్యమనవచ్చు.

ఎలక్ట్రిక్ షాకులకు లోనుకాకుండా ఉన్మాదిని మనదగ్గరకు తీసుకొస్తే హోమియో వైద్యము ద్వారా చక్కని నివారణను ఒక్కమాటలో పునర్జన్మను అందించడానికి నూటికి తొంభై పాళ్ళు అవకాశాలున్నాయి. ఎలక్ట్రిక్ షాకులు ఇచ్చిన తరువాత మనదగ్గరకు పట్టుకవస్తే నివారణ వాళ్ళ అదృష్టం మీద ఆధారపడి ఉంటుంది. అప్పటికే మనిషి ధ్వంసం చేయబడ్డాడు కనుక నివారణను గూర్చి మనం అభయం పట్టకూడదు. ఒకవేళ జరిగితే అది వాళ్ళ అదృష్టంగా భావించాలి.

చిత్రం ! ఉన్మాదులకు కావలసిన భవనాలు, సౌకర్యాలు వాళ్ళ దగ్గర ఉన్నాయి. ఉన్మాదులను రక్షించగలిగిన ఔషధాలు మా దగ్గరున్నాయి. ఈ ఔషధాలు, ఆ సౌకర్యాలు కలిస్తే! ప్రజలు—ప్రభుత్వము వివేకంతో ప్రవర్తించగలిగినపుడు అది జరుగుతుంది. ఏమంటారు!

సోదరులారా! మీతోపాటు మన సమాజానికి కూడ ఒకపిలుపునిస్తున్నాను. తరతరాలుగా గుడులు, గోపురాలు దేవుడికి మనం చాలా కట్టాం. ఈవాట్టికి కూడ గుడిగోపురాలకు ధనాన్ని వెచ్చించడానికి మనం

సిద్ధంగానే ఉన్నాం. గుడిగోపురాలు కట్టడం తప్పని నేను అనను. మనిషి మనిషిగా నిలబడడానికి, దైవంగా మలచబడడానికి కావలసిన శిక్షణకు అవి అవసరమే. ఇప్పటికే ఆ గుడి గోపురాలు మనకు తగుమాత్రం ఉన్నాయి. నేనిప్పుడు, మానసిక చికిత్సాలయాలనే దేవాలయాలను మీరు నిర్మించ గలరా? ఆ దేవాలయాలలో మనస్సు చెదరిన మన ఉన్మాద సోదరులను సజీవ విగ్రహాలుగా ఆరాధించగలరా! అని అడుగుతున్నాను. అందుకు సిద్ధపడమని కోరుతున్నాను. ఒక మానసిక వైద్యాలయాన్ని నిర్మించి మధ్యలో శ్రీరాముణ్ణి ప్రతిష్ఠించామనుకోండి. ఆ రాముడు వద్దంటాడా? వద్దనడు. నాకు ఈ గుడే బాగుంది ఇలాంటి గుడులే నాకు కావాలని ఆ రాముడు అంటాడని నేను అనుకుంటున్నాను. నేను అంటున్నాను, గుడిని కట్టి దేవునికి సేవలు చేస్తున్నారు ఎందరో. మనం సేవమధ్యలో, మానవసేవ మధ్యలో ఆ దేవుణ్ణి నిలుపుకుందామా! అప్పుడు ఆ దేవుడు జరుగవలసినసేవ ఇదేనని ఇంకా సంతోషిస్తాడేమో! ఇప్పుడు విగ్రహా రాధన సజీవ విగ్రహారాధనగా రూపొందుతూ ఉన్నదని మరింత సంతో షిస్తాడేమో! మిత్రులారా! ఆలోచించండి

సోదరులారా! నాకు గాఢంగా అనిపిస్తోంది. సాధ్యమైనంత త్వరలో సామూహిక కృషితో మానసిక వైద్యాలయాలను మనం రూపొందించగలగాలి. మనస్సు చెదరి అయోమయావ్యవస్థలోపడి కొట్టు కుంటున్న తోటి సోదరులకు మన మింత సేవ చేయాలి. వారికి చేసిన సేవే నిజమైనసేవ అవుతుందని అనిపిస్తోంది నాకు. ద్రష్టలైన వారు దివ్యమైన హోమియో వైద్యాన్ని దర్శించి మనకు అందించారు. అమోఘమైన దాని శక్తియుక్తుల్ని ఉపయోగించి మనస్సు చెదిరిన మన

సోదరుల్ని సేద తీరుద్దాం.వాళ్ళకు మనస్సు కుదుటపడుతున్న వేళ మళ్ళీ తిరిగి వాళ్ళు ఈ లోకంలోకి వస్తున్నవేళ, ఆదృశ్యాన్ని చూస్తున్న మనకు కలిగే ఆనందం ముందు మోక్షానందం కూడ నిలువలేదేమో! నిజానికి మోక్షమంటే అదేనేమో! అంతకంటే మరి వేరే లేదేమో! ఆర్తజనులసేవలో మన మనస్సులు కరిగి మనము ఆత్మస్వరూపులమై మననుండి ప్రేమ వెదజల్లబడుతున్న వేళ, ఆ ఆనందమయస్థితి కన్న మోక్షమన్నది మరి వేరే ఎక్కడ ఉన్నది? సోదరులారా! అలాంటి దివ్య స్థితి వైపు నడిచేందుకు మీరు సిద్ధంకండి. సామాజికులారా! మనుష్యులను నిండుగా సేవించడానికి కావలసిన వైద్యాలయాలనే దేవాలయాలు నిర్మించడానికి మీరు దీక్ష బూనవలసి ఉన్నది. అప్పుడు 'మానవసేవే మాధవసేవ' అన్న మన పెద్దల సందేశానికి మనం వారసులమవుతాం. నేను చెప్పింది మీకు నచ్చింది కదా! అనాదిగా పెద్దలందరూ చెపుతూ వస్తున్నదే ఇప్పటి పరిస్థితులకు అనుగుణంగా మరొక్కసారి చెప్పాను నేను. ఇక కదలి రండి! కలసి నడుద్దాం! ఆర్తజనుల సేవలో అందరం ఒకటిగా నిలుద్దాం.

  

## ఉద్యమ వనాలను సృష్టిద్దాం-
## పెద్దలారా కదలిరండి!

ఈ గాంధీ జయంతి శుభ సందర్భాన ఇటు వేదికపైన, అటు సభలోను వేంచేసియున్న చిత్త శుద్ధి కల్గిన గాంధేయవాదులందరికీ నా అభినందనాలు తెల్పుతున్నాను.ఆ మహాత్మునితో చేయి కలిపి సంచరించి, వారి శిక్షణలో జీవితాలను తీర్చి దిద్దుకున్న ఇందరి మధ్య నిలబడి ఆ దివ్య పురుషునికి ఏటికోళ్ళు సమర్పిస్తున్నందుకు నాకెంతో ఆనందంగా వుంది. పెద్దలారా ! ఈ శుభ సందర్భాన మానవ జీవితాలకు కావలసిన ఎన్నో అంశాలను మహాత్ముని జీవితాన్ని ఆధారంగా చేసుకొని, మీరు ప్రస్తావించారు. ఆ ప్రస్తావించడంతో బాటుగ మహాత్ముని సిద్ధాంతానికి, సందేశానికి, ఈ దేశం, ఈ జాతి, ఈ తరం దూరం అయిపోతుంది అన్న బాధను మీరందరూ వెల్లడించారు. ఇది, ఇలాగే కొనసాగితే, ఈ ప్రజలు ఏమైపోతారని ఆందోళనతో పూడుకుపోయిన గొంతులతో మీరు మాట్లాడారు. నిజమే. ఇది విచారించవలసిన విషయమే. నిజంగా విచారించవలసిన విషయమే.

పెద్దలారా ! నేను కొన్ని దృశ్యాలను, కొన్ని సత్యాలను మీ ముందు ఉంచుతాను. ప్రశాంత మనస్కులై పరిశీలించండి మీరు. నా దృష్టిలో ఈ జాతి, ఈ తరం గాంధీ సిద్ధాంతానికి దూరం కాలేదు.

దూరం చేయబడింది. స్వాతంత్ర్యానంతరం కొనసాగిన విద్యా విధానంలో గాంధీ మహాత్ముని గురించి గాని, వారి శిక్షణలో రూపొందిన మిగిలిన మహానుభావుల గురించి గాని ఏ మాత్రం విద్యార్థులకు అందించ బడిందని నేను అడుగుతున్నాను? దేశ నాయకుల గురించి, స్వాతంత్ర్య సమరాన్ని గురించి అందించవలసిన పద్ధతి లో విద్యార్థులకు అందించి ఉంటే, పెద్దలారా ! ఈ ప్రజలు ఆ మహాత్మునికి దూరమయ్యే వారా ? మీరే చెప్పండి. మేము డిగ్రీ చదువుతున్న రోజులలో కూడా లార్డ్ క్లైవ్ జీవితచరిత్రను పాఠ్యగ్రంథంగా పెట్టారు. గాని, మహాత్ముని ఆత్మ కథను పాఠ్యాంశంగా పెట్టడానికి ఈ విద్యా విధాన నిర్ణేతలకు ప్రాణం ఒప్పలేదు. చెప్పండి. వారిని గురించి చెప్పకుండా వారికి ఈ తరం దూరమయిందని అనడం ధర్మమా ?

ఒకవేళ ఈ విద్యావిధానంలో నామమాత్రంగా మహాత్ముని గురించి గాని, ఇతర దేశనాయకుల గురించి గాని ప్రసక్తి వచ్చినా, అర్థం లేని పరీక్షావిధానం అడ్డుపడడం వలన ప్రయోజనం శూన్యమే అయింది. ఈ పరీక్షా విధానంలో విద్యార్థులు మార్కుల కోసం చదువుతున్నారు తప్ప తమలో రావలసిన మార్పుల కోసం చదవడంలేదు. చదువుకు మార్కులు గమ్యం అయినపుడు ఇంక ఎవరిని గురించి ఏమి చెప్పినా ఒకటే. విద్యార్థి దృష్టి ప్రశ్నలపైనా, ఆ ప్రశ్నలకు వ్రాయవలసిన సమాధానాలపైనా, ఆ సమాధానాలకు వచ్చే మార్కులపైన ఉంటుంది కాని పాఠ్యాంశంపై ఉండదు. ఆ పాఠం బోధిస్తున్న పరమార్థంపై అతడి దృష్టి అసలు పడదు. ఆ పరమార్థాన్ని అనుభవించకుండానే, యాంత్రికంగా అతడు ఆ పాఠాన్ని చదువుకొని గట్టు ఎక్కుతున్నాడు. భోజనం చేస్తూ ముద్ద నోటిలో పెట్టుకోబోతున్న వానిని, నీవు తింటూ ఉండగా నీకు నేను ఫోటో తీస్తాను. అని చెబితే, అతడు ఆ

ముద్దరుచిని అనుభవించగలడా ! పెద్దలారా ! ఒక్కమాట చెప్పనా ! పరీక్ష అనేది జరగాలి తప్ప, పెట్టబడకూడదు. అదికూడా ఆ విద్యార్థికి తెలియకుండానే జరగాలి. పాఠ్యాంశాలను ఆ విద్యార్థి తన జీవితంలోనికి ఎంతగా స్వీకరిస్తున్నాడు, ఎంతగా అతడి మనస్సు వికసిస్తున్నది అన్నది ఉపాధ్యాయుడు గమనించాలి తప్ప కేవలం జ్ఞాపకశక్తికి పెట్ట బడేది అదీ ఒక పరీక్షేనా ? ఆ పూటకు ముక్కున పట్టుకొనివచ్చి మన ముందు చీదేస్తే మనం మార్కులు వేసేయడమేనా ? ఇలాంటి పరీక్షా విధానం అమలులో ఉన్నపుడు, ఇంక ఏమి చెప్పి ఏమి లాభం ! కనుక పెద్దలారా ! ముందు చూపు లేని విద్యా విధానం, అర్థం లేని పరీక్షా విధానం ఈతరాన్ని ఇలా నిర్వీర్యం చేస్తున్నాయి సుమా !

ఇంకొక్కటి చెప్పుతాను చూడండి ! స్వాతంత్ర్యం వచ్చిన తరువాత గాంధీ మహాత్ముని అనుయాయులలోనే కొందరు పాలకు లయ్యారు. మరికొందరు మానవజాతికి సేవకులుగా మిగిలి పోయారు. పెద్దలారా ! నాకొకటి అనిపిస్తుంది కదా, ఆ పాలకులు, ఈ సేవకులను ఊతంగా తీసుకొని ఈ దేశాన్ని మహాత్ముడు కోరినట్లుగా తీర్చిదిద్దితే ఎంత బాగుండేది. కాని, అది జరగలేదు. ఈ పాలకులు ఆ సేవకులను అంతగా పట్టించుకోనే లేదు. ఆ సేవకులు వాళ్ళ మానాన వాళ్ళు నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి చేయగలిగినంత సేవ చేస్తూ దేహాలున్నంతకాలం జీవించి వెళ్ళిపోతూవచ్చారు. ఆ సేవకులను ప్రణాళికా బద్ధ గా వినియో గించగలిగితే ఈ దేశం రూపు రేఖలు ఇలా ఉండేవా ! మీరే చెప్పండి?

ఇప్పుడు చెప్పండి! ప్రజలు మహాత్మునికి దూరమయ్యారా. దూరం చేయబడ్డారా ? పై కారణాలతో బాటుగా ఇంకొక్క కారణం బలీయమైనది ఉన్నది. స్వాతంత్ర్యం వచ్చినపుడు ఏమి జరిగింది అంటే

వందల సంవత్సరాల బానిసత్వంలో నుంచి బయటపడిన జాతి ఒక్క-సారిగా స్వేచ్ఛను అందుకుంది. ఇది పంజరంలోని చిలుక బయట పడడం లాంటిది అయింది. చిత్రం ! అంతవరకు నియమనిష్ఠలను అలవరచు కోవడానికి ప్రయత్నించిన జాతి, నియమ నిష్ఠలకు ప్రాధాన్య మిచ్చిన జాతి, ఒక్కసారిగా ఈ దొరికిన స్వేచ్ఛతో గతాన్ని మరచి భోగాల వైపుకు మళ్ళింది. నియమనిష్ఠలను నిర్లక్ష్యం చేయసాగింది. జనజీవితంలో ధర్మాన్నికన్నా, ధనానికి ప్రాధాన్యం పెరిగింది. భారతీయుడి దృష్టి డబ్బుమయం అయింది. డబ్బు....డబ్బు....డబ్బు—ఎటు చూసినా డబ్బే. భార్యాభర్తల మధ్య డబ్బు—తండ్రీ బిడ్డల మధ్య డబ్బు బంధువుల మధ్య డబ్బు-మిత్రత్వాల మధ్య డబ్బు. చివరకు పెళ్ళాడేటప్పుడు కూడా డబ్బే. అదే ప్రాధాన్యం వహిస్తోంది. ఒక్క సత్యాన్ని గమనించండి. ప్రపంచ దేశాలలో ఇంక ఏ దేశంలోను ఇంత డబ్బు వ్యామోహం మనకు కనబడదు. ఒక్క మన దేశంలోనే కనబడుతుంది. ఇన్నాళ్ళ బానిసత్వ ఫలితంగా స్వేచ్ఛ దొరికేటప్పటికి మన మనస్సుల నుండి పేట్రేగిన ఒక దారుణమైన వికారమిది. ఒకప్పుడు ధర్మానికి శిరస్సు వంచిన జాతి మనది. ఇప్పుడు అది ధనానికి పాదాలు వత్తుతున్నది. ఎంత ఆశ్చర్యం ! ఆహా, ఆ మానసిక వికార మహిమ ఎంతటిది !

ఇప్పుడిప్పుడే జాతికి చేసిన తప్పిదం తెలిసి వస్తున్నది. డబ్బు-డబ్బు అని పరిగెత్తిన మనిషి అలసి నిలబడిన వేళ తనను పలుకరించేందుకు ఒక మనస్సున్న మనిషి కోసం ఎదురు చూస్తున్నాడు. జీవితానికి కావలసింది ఏమిటో, జీవితం కోరేది ఏమిటో అతనికి

ఇప్పుడు మళ్ళీ తెలిసివస్తోంది. ఇప్పుడు మళ్ళీ మహాత్ముని సందేశాన్ని వినిపించవలసిన తరుణం ఆసన్నమయింది. పెద్దలారా ! మహాత్మునివి సిద్ధాంతం అనడం కన్నా సందేశంగా స్వీకరించడం, ఉపదేశంగా ఆ దివ్య భాషణకు చెవి ఒగ్గడం మనకు చేతకావలసి ఉంది.

ఇప్పటి యువతరంలో ఎంతో ఉత్సాహం కనబడుతోంది. ఆవేశం వ్యక్తమవుతోంది. దేశశ్రేయస్సు కోసం పని చేయాలన్న తపన కనబడుతోంది. పోగొట్టుకొన్న దానిని తిరిగి సాధించుకోవాలన్న సంకల్పం కనబడుతోంది. మీరు బెంగ పడనక్కరలేదు. మహాత్ముని ఆశయాలకు రూపకల్పన మళ్ళీ ఈ తరంతో ప్రారంభం అవుతుంది. పెద్దలారా ! మహాత్మునిది వజ్ర సంకల్పం కదా ! అది వృధా పోతుందా! పోదు. మధ్యలో ఒక తరం ఆయన మాటను వినిపించుకోలేకపోయినా, మళ్ళీ ఇప్పుడు ఎదిగివస్తున్న తరంతో ఆయన తన ఆశయాలకు రూపు దిద్దుకొంటాడు. నేను మీకు హామీ ఇస్తున్నాను. ఇంతకు ముందే మాట్లాడిన యువకులైన మన కమీషనర్ శ్రీ ఎ. కె. రాజుగారు మాట్లాడిన తీరులోని ఉత్సాహాన్ని మీరు చూశారు కదా ! ఆయన పదవిలో ఉండి బాధ్యతతో మాట్లాడారు. నేను ప్రజలలో నుండి ఉద్యమ శీలినై మాట్లాడుతున్నాను. ఆయన చెప్పినట్లుగా ఇక్కడే కాదు ప్రతి పట్టణంలోనూ మహాత్ముని గురించి "స్టడీ సెంటర్స్" వెలవాలి. ఆ సెంటర్స్‌లో మహాత్ముని సమగ్ర సందేశంతో పాటుగా, ఆయన అనుయాయులైన మహా నాయకుల గ్రంథాలు, జీవితచరిత్రలు సమకూర్చబడాలి ఆ స్టడీ సెంటర్స్ నిర్వాహకులుగా మహాత్ముని దగ్గర శిక్షణ పొందిన వారిలో మిగిలిన పెద్దలు ఇంకా ఉన్నారు కదా. వారు వియో

గించబడాలి. ఆ కేంద్రాలకు చదువుకొనేటందుకు వచ్చిన యువకులకు ఆ మహాత్ముని సహచరులు ఆలనాటి విశేషాలను ప్రత్యేకతలకెత్తుతూ ఆ దివ్య సాహిత్యాన్ని అందించగలగాలి. అప్పుడు, యువత చాలా కొద్ది కాలంలో చైతన్యవంతం అవుతుంది. యువత సిద్ధంగా ఉన్నారు. సరి అయిన పద్ధతిలో పెద్దల సందేశాన్ని వారికి అందించగలవారేకావాలిప్పుడు

మహాత్ముడు గడిపిన నిరాడంబర జీవితం. దినచర్యలో నియమ నిష్ఠలకు ఆయన ఇచ్చిన ప్రాధాన్యత, కర్తవ్య నిర్వహణలో ఆయన చూపిన దీక్ష నేటి యువత కు మార్గదర్శకం కావాలి. ముఖ్యంగా ఆయన గ్రామరాజ్యాన్ని కోరారు. గ్రామాల స్వయం సమృద్ధిని ఆయన ఆకాం క్షించారు. స్వాతంత్ర్యానంతరం మనం దానికి విరుద్ధంగా ప్రవర్తించాం పట్టణాలకు ఎగబ్రాకే ప్రజల సంఖ్య పెరిగిపోతోంది. కలకత్తాలాంటి నగరాల పాలకులు పెరిగిపోతున్న జనసంఖ్యను ఏంచేయాలో తోచక తలలు పట్టుకొంటున్నారు. కొద్దిరోజులలో ఆ స్థితి మన విశాఖ పట్ట ణానికీ వస్తుంది కనుక ఇప్పటికైనా మనం మేల్కొని గ్రామాలవైపు దృష్టిని సారించాలి. ఒక పెద్ద పరిశ్రమను, కొన్ని పదుల చిన్నపరిశ్రమ లుగా విభజించి వాటిని గ్రామప్రాంతాలలోనే స్థాపించాలి. కావలసిన అన్ని సౌకర్యాలను సమకూర్చి గ్రామాన్ని స్వయం సమృద్ధి కల్గిన ఒక చిన్న పట్టణంగా రూపొందించాలి. ఇంకొక్కమాట చెబుతాను ఇప్పుడు మనం కార్మికులు వేరు, కర్షకులు వేరుగా భావిస్తున్నాం. గ్రామ ప్రాంతాలలో రెండు ఎకారాలుండి స్వతంత్రజీవనం గడపగలిగిన రైతు పట్టణప్రాం తానికి వచ్చి ఒక కూలిగా మారిపోతున్నాడు. అలా జరగకూడదు. కర్షకుడు, కార్మికుడు ఒకరే కావాలి. రైతు తన వ్యవసాయాన్ని తాను చక్కగా చేసుకొంటూనే అ గ్రామంలో నెలకొల్పబడిన పరిశ్రమకు

కార్మికుడు గా పని చెయ్యాలి. కావాలంటే, వ్యవసాయ తరుణం వచ్చినప్పుడు ఆ కొద్దిరోజులు వారికి శెలవు యివ్వవచ్చు. ఇప్పుడు పల్లెలలో ఏం జరుగుతోందో గమనించారా ? వ్యవసాయతరుణంలో రైతులకు ముమ్మరంగా పని ఉంటుంది. ఆ తరుణం అయిపోయాక వారు ఏం చేస్తున్నారు ? వ్యసనాలతో అక్కరలేని రాజకీయాలతో, అర్థం లేని వినోదాలతో జీవితాన్ని అంకితం చేస్తున్నారు. మానవ శక్తి ఎంత కాలిపోతోందో చూశారా ! మనం ఎన్నింటినో ఉపయోగించుకోవాలి అనుకుంటున్నాం మనం ఎన్నింటినో పొదుపు చేయాలని అనుకుంటున్నాం. మరి కాలిపోతున్న ఈ మానవశక్తి మాట ఏమిటి? ఆలోచించండి. మానవశక్తిని సద్వినియోగం చేయడం అనే ఈ యజ్ఞానికి మనం ఇప్పుడు సిద్ధం కావలసి ఉంది. ఆ ఒక్కటి మనకు చేతనైతే ఈ దేశం రూపురేఖలు మారిపోవా ? ప్రపంచ దేశాలకే ఈ దేశం మార్గదర్శకమై నిలబడదా ! మహాత్ముడు ఊహించిన ఆ ఊహాచిత్రం రూపు ధరించదా ! పెద్దలారా ! ఆ యజ్ఞానికి సిద్ధమవుతున్న ఈ యువతరాన్ని ఆశీర్వదించండి. ఆ యజ్ఞానికి సిద్ధమవుతున్న ఈ యువతకు ఆనందంతో మీ అనుభవాలను పంచండి. మమ్మల్ని పెంచండి. మీ అనుభవాల జలాలను పోసి ఈ యువకులనే మొక్కలను కన్నుల పండుగగా పెంచడానికి పూనుకోండి. ఉద్యానవనాలను సృష్టించినట్లు, ఉద్యమ వనాలను సృష్టిద్దాం ఓ తలపండిన పెద్దలారా ! ద్విగుణీకృతమైన ఉత్సాహంతో ఈ యువత వైపుకు కదలిరండి.

  

## ఉద్యమమే ఊపిరిగా ముందుకు సాగుదాం!

ఈ ఉత్సవాల నిర్వహణతో మన ఉద్యమం ఒక మలుపు తిరిగిందని భావిస్తున్నాను. ఈ సందర్భంగా ఇటు విశాఖలోను అటు విజయవాడలోను మాష్టరుగారికి సన్నిహితులు, స్నేహితులు, శిష్యులు మాష్టరుగారిని వెలుగుగా దర్శించిన పెద్దలు ఎందరో నడచివచ్చి ఉత్సవ వేదికలపై మాష్టరుగారి తత్త్వాన్ని మనకు ప్రకాశింపజేశారు. వారి సాన్నిధ్యాన్ని మనచే అనుభవింపజేశారు. మాష్టరుగారి ప్రణాళికయెడల మన కన్నులు మరింత విచ్చుకునేటట్లుచేశారు. మాష్టరుగారి సేవాసందేశానికు నివాళులర్పిస్తూ ఆ ఉద్యమం మనద్వారా జగద్వ్యాప్తం కావాలని శుభాకాంక్ష లందించారు. మనను ఆశీర్వదించారు. మాష్టరుగారే ఇన్ని మూర్తులుగా నడచివచ్చి తానంటే ఏమిటో మరొకసారి తెలియజెప్పి ఇక ముందుకుసాగమని వెన్నుతట్టినట్లయ్యింది.

ఇటు విశాఖలోను అటు విజయవాడలోను జోరున వర్షాలు కురుస్తున్నా కార్యక్రమాలు మాత్రం నిర్విఘ్నంగా కొనసాగాయి.కార్యకర్తల దీక్ష చక్కగా వ్యక్తమయింది. ఇంకొక విషయంలో నాకు మరీ సంతోషంగా ఉన్నది. ఈ ఉత్సవాలసందర్భంగా నేను విజయవాడలో ఉన్నప్పటికి ఇక్కడ విశాఖలో ప్రకృతివైపరీత్యాలకు అతీతంగా నిలబడి

కార్యకర్తలు ఉత్సవాలను దీక్షతో అనుభూతిప్రదంగా నిర్వహించారు. ఆయనఉంటే పనులవుతాయి అన్నస్థితినుండి కార్యక్రమరూపంలో ఆయన ఎప్పుడూ మనలో ఉన్నారు. కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించడమే మనము ఆయనకు చేయవలసిన అర్చన—అన్న స్థాయికి సోదరబృందం ఎదిగినందుకు నాకెంతో సంతోషంగావుంది. "వ్యక్తి లేకపోతే ఉద్యమానికి విస్తృతి రాదు. వ్యక్తిపైన ఆధారపడితే ఆ ఉద్యమం ముందుకు సాగదు. కనుక వ్యక్తి ఉండాలి. అతణ్ణి మనం ఆదర్శంగా స్వీకరించాలి తప్ప అతనిపై ఆధారపడకూడదు. ఆధారపడే స్థితినుండి ఆదర్శంగా స్వీకరించే స్థాయికి ఎదిగిరండి." అని మనసంస్థను ప్రారంభిస్తూ నేను పిలుపునిచ్చినసంగతి మీకు గుర్తుండి ఉంటుంది. ఆ నా పిలుపునకు తగినట్లుగా మీరు ఎదిగివస్తున్నందుకు నాకుచాలా సంతోషంగా ఉన్నది. ఈ మన ఉద్యమం చక్కగా కొనసాగి సత్ఫలితాలను జాతికి అందీయగలదని నాకు విశ్వాసం కలుగుతూ ఉన్నది.

మాష్టర్ జ్వాల్‌కూల్ ఇద్దరి గురువులవద్ద శిక్షణనుపొంది నేడు విశ్వప్రణాళికలో తమపాత్రను దీప్తిమంతంగా పోషిస్తూ ఉన్నారని దివ్యజ్ఞాన వాఙ్మయం చెబుతూ ఉన్నది. అలాగే నాకుకూడ మాష్టరు ఇ. కె., బ్రహ్మశ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగార్ల దగ్గర ఏకకాలంలో శిక్షణ పొందే అవకాశం లభించింది. ఇప్పుడు నేను మాష్టరుగారు అందించిన విశ్వవిశాల దర్శనానికి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అందించిన క్రమబద్ధమైన జీవనవిధానానికి జతకలిపే ప్రయత్నం చేస్తూ ఉన్నాను. ఈ రెండింటిని అనగలుపుకొని జాతి పునర్నిర్మాణ ఉద్యమానికి రూపుదిద్దే ప్రయత్నంచేస్తూ ఉన్నాను. విశాలదర్శనంలేని క్రమశిక్షణ సాధించదు. క్రమశిక్షణ లేని విశాల దర్శనం రాణించదు. క్రమశిక్షణతోకూడిన విశాల దర్శనంతో మనమిప్పుడు కార్యాచరణకు సిద్ధంకావలసి ఉన్నది. ముగ్గు

వేయడానికి, ముగ్గుపొయ్యడానికి తేడ చాలాఉన్నది. వాకిట్లోముగ్గువేశాం అన్నప్పుడూ వాకిట్లో ముగ్గుపోశాం అన్నప్పుడూ అర్థ మెంత మారి పోతూ ఉన్నది? రెండుచోట్ల ఉన్నది ముగ్గే. దాన్ని పారబోసినప్పుడు అసహ్యం వేస్తున్నది. ముగ్గులుముగ్గులుగా వేసినప్పుడు అందం ఉట్టి పడుతున్నది. పద్ధతిగా ప్రవర్తించడంలో అంత తేడా వస్తున్నది. మాష్టరుగారు అందించిన సమన్వయమనే ముగ్గును శాస్త్రిగారందించిన క్రమశిక్షణతో లోకానికి రకరకాల రంగవల్లికలుగా తీర్చిదిద్ది మనం సమర్పించవలసి ఉన్నది.మాష్టరుగారి సందేశాన్ని అందించడానికి దీక్షతో మీరు కృషిచేయడం, ఈ చివరిరోజు వేదికపైన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఆసీనులై ఉండటం ఒక విశిష్టమైన సన్నివేశంగా నాకు గోచరిస్తూ ఉన్నది.

సోదరులారా! ఇదే క్రమశిక్షణను అడుగడుగున మీరు ప్రదర్శింతురు గాక! ఈ పెద్దల ఆశీస్సులతో ఉద్యమమే ఊపిరిగా మన ప్రయాణాన్ని కొనసాగింతుముగాక! మాష్టరు ఇ. కె. మనకు అందించిన జాతి పునర్నిర్మాణ ప్రణాళిక పరిపూర్ణంగా అమలుపరచబడేటంతవరకు విశ్రాంతిని కోరకుందుముగాక! మనకు పనిలోనే విశ్రాంతి, పనిని విడిచిన విశ్రాంతి అది విశ్రాంతికాదు. సోమరితనం అవుతుంది. మనకు సుఖం, శాంతి, హాయి, విశ్రాంతి అన్నీ మనకు కర్తవ్య నిర్వహణ లోనే.

★★★